

GRAMS : "CHANDAMAMA"

PHONE : 444851—6 LINES

ESTD. 1947

# CHANDAMAMA PUBLICATIONS

(Prop. : SARADA BINDING WORKS)

2 & 3, ARCOT ROAD :: VADAPALANI :: MADRAS-26

ప్రియమైన పాఠకులకు,

ఆంగ్లభాషలో "చందమామ" ఈ నెలలో వెలువడుతుందని క్రిందటిసారి మీతో మనవి చేశాము. అన్నమాట ప్రకారంగానే పత్రిక వెలువడింది; అమ్మకం జరుగుతూంది; అందరూ పత్రికను చూచి మెచ్చుకుంటున్నారు. చక్కని ఇంగ్లీషులో పది మంచి కథలున్నాయి; కచ్చితంగా అవి మీకు ఆనందాన్ని కలిగిస్తాయి.

ఇవాళే ఒక ప్రతి తెప్పించండి. ఆంగ్ల 'చందమామ' వెల 75 పైసలు. కొన్న తర్వాత—ఆంగ్ల 'చందమామ' మీకు వినోదాన్ని మాత్రమే కాదు—ఆంగ్లభాషతో సాన్నిహిత్యాన్ని పెంపొందింప జేసుకోడానికి కూడా సహాయపడగలదు!

సంపాదకుడు



# బిన్నీ కేస్‌మెంట్
# క్లాసులలో చదువుకొనేటప్పుడు బయట ఆడుకొనేటప్పుడు వుపయోగానికే తయారైంది

BY-5819

స్కూళ్లు తెరవడానికి యింకా ఎన్నిరోజులుంది?
మీ పిల్లల స్కూలు యూనిఫారమ్ తయారు
చేసుకోడానికి టైము కాలేదూ!
బిన్నీ కేస్‌మెంట్ బట్ట రెండువిధాల
అమూల్యము.
యూనిఫారమ్‌లకు అందంగా వుండి,
క్లాసు రూములోనూ వేసుకోవచ్చు. దిట్టంగా వుండి
బయట ఆడుకోడానికి బాగా పనికివస్తుంది.
అనేక ఛాయలలో ఆయా స్కూళ్లు నిర్ణయించిన
నిబంధనలకు యూనిఫారములకు
అనుగుణ్యంగా లభిస్తాయి.
ఎన్ని ఉతుకులు వుతికినా రంగులు కనదిగవు.

బిన్నీ











VIVA
ViVA
FORTIFIES YOU FOR THE DAY
RELAXES YOU FOR THE NIGHT



# మీ కోసమే కావలసినన్ని తీరుల్లో టూత్‌బ్రష్‌లు కేవలం మీ కోసం

మీ పళ్ళకోసం....
మీ ఇగుళ్ళకోసం....
మీక్కావలసిన తీరుల్లో....
మీ వయసుకు జోడుగా....

ఒక్క బినాకా లోనే—
తీరుతీరులుగా,
వయసుకు జోడుగా




బినాకా టూత్‌బ్రష్ కొనలు గుండ్రంగా వుంటాయి—ఇగుళ్ళను ఏమాత్రం గాయపరచవు



## టూత్‌బ్రష్ బినాకా గనక అయితే అదే మీకెంతో మంచిది

**Binaca®**

ULKA : CTB-66 TEL



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

"పొదుగు కోసి పాలు తాగటం" అనే సామెత అందరికీ తెలిసినదే. భవిష్యత్తు మీద దృష్టిలేని వాళ్ళు, ఆ క్షణంలో తమ సౌఖ్యమే చూసుకుంటారు. కాని ముందుచూపు గల వాళ్ళు పొదుపు యొక్క విలువ తెలుసుకుని, ముందు ముందు స్థిరంగా సుఖం పొందగలందులకు తాత్కాలికంగా సుఖాన్ని త్యాగం చేస్తారు. వ్యక్తుల విషయంలోనే గాక, దేశాల విషయంలో కూడా ఇది నిజం. పొదుపుకు సంబంధించిన నీతి "పొదుపు రహస్యం" అన్న కథలో ఉన్నది.

సంపుటి 47 జూలై '70 సంచిక 1



CHITRA



# అమరవాణి

జాతిర్యాతు రసాతలం, గుణగణ స్తత్రాప్యధోగచ్ఛతాత్,
శీలం శైలతటాత్పత, త్వభిజన స్సన్దహ్యతాం వహ్నినా,
శౌర్యే వైరిణి వజ్రమాశు నిపత, త్వర్థోస్తునః కేవలం,
యేనైకేన వినా గుణా స్తృణలవ ప్రాయాస్సమస్తా ఇమే. 1

[జాతి పాతాళానికి పోయేదిగాక, గుణాలు అంతకన్నా దిగజారేదిగాక, శీలం పతనమయేదిగాక, వంశం బూడిద అయేదిగాక, శౌర్యం చితికిపోయేదిగాక, మాకు డబ్బు ఉంటేచాలు. అది లేకపోతే పైవన్నీ గడ్డిపోచకైనా కావు.]

యస్యాస్తి విత్తం సనరః కులీనః, సపండితః సశ్రుతవాన్ గుణజ్ఞః,
స ఏవ వక్తా, సచదర్శనీయః; సర్వేగుణాః కాంచన మాశ్రయంతి. 2

[డబ్బు గలవాడే కులీనుడూ, పండితుడూ, శాస్త్రజ్ఞుడూ, గుణం గుర్తెరిగినవాడూ, అందగాడూ, మాటకారీనూ. అన్ని సద్గుణాలూ బంగారంతోనే వస్తాయి.]

దానం, భోగో, నాశః త్రిస్రో గతయో భవన్తి విత్తస్య,
య న్నదదాతి, నభుంక్తే, తస్యా తృతీయా గతి ర్భవతి. 3

[దానమూ, భోగమూ, నాశమూ అన్నవి ధనానికి మూడు గతులు. దానానికి, భోగానికి ఉపయోగించని ధనానికి మూడో గతే (నాశం) పట్టుతుంది.]

---

ధనం

---



# పొదుపురహస్యం

పడమటి తీరాన గణేశుడూ, గంగాధరుడూ అని ఇద్దరు యువకు లుండేవారు. వాళ్ళు ఒకే గ్రామంలో ఉండ, చిన్నతనం నుంచీ కలిసి తిరిగారు. వాళ్ళు యుక్తవయస్కులై తమ బతుకుతెరువు తాము చూసుకోవలిసి వచ్చేసరికి వారుండే ప్రాంతం బొత్తిగా కాటకప్రాంతమై పోయింది. అందుచేత వాళ్ళు తూర్పు తీరానికి వెళ్ళి, సంపద సమృద్ధిగా ఉండే చోట జీవనోపాధి కలిగించు కుందా మనుకున్నారు.

"మనిషి పొట్ట కెంతకావాలి? ఇంత అన్నమూ, ఎండుచేపలూ తింటూ ఎంత కాలమైనా బతకవచ్చు. అలా పొదుపుగా జీవిస్తూ, కష్టపడి సంపాదించినదానిలో నుంచి సాధ్యమైనంత మిగుల్చుకున్నా మంటే, అది పెట్టుబడిగా ఏ వర్తకం చేసుకున్నా జీవితం సుఖంగా గడిచిపోతుంది," అన్నాడు గంగాధరుడు.

"అలాగే పొదుపుగా జీవించి పైకి వద్దాం," అన్నాడు గణేశుడు.

ఇద్దరూ ప్రయాణం చేసి తూర్పుతీర ప్రాంతం చేరుకున్నారు. అది సుక్షేత్రం. ఎక్కడ చూసినా ఏపుగా పెరిగిన పైరులు కనిపించి, వారి కళ్ళను ఎంతో ఆనంద పరిచాయి.

స్నేహితు లిద్దరూ ఒక నగరం చేరారు. అక్కడ వర్తకం కూడా బాగా సాగుతున్నది. నగరం చేరుతూనే స్నేహితులిద్దరూ చీలి పోయారు. ఒకటి, రెండేళ్ళపాటు ఎవరి కృషి వారే చేసుకోవటమూ, ఎవరి అదృష్టాన్ని వారే వెతుక్కోవటమూ, ఒకరి బరువు ఒకరి మీద వెయ్యకుండా ఉండటమూ మంచిదని వారికి అనిపించింది.

గణేశుడు దొరికిన పని ఏదైనా చేసి, రోజూ పొదుగునా శ్రమపడి డబ్బు సంపాదించసాగాడు. గంగాధరుడు చెప్పినట్టే

సి. చంద్రశేఖర్

అతను వరిఅన్నమూ, ఎండుచేపలూ తింటూ, సాధ్యమైనంత తక్కువ ఖర్చుతో కాలక్షేపం చేస్తూ వచ్చాడు.

కాని గణేశుడు ఎంతోకాలం ఇలా చెయ్య లేకపోయాడు. ముఖ్యంగా అతనికి తిండి గురించి అసంతృప్తి ఏర్పడింది. దగ్గిర డబ్బు ఉండగా, నోరు కట్టేసుకోవడం అతనికి సాధ్యం కాలేదు. అందుచేత ఒకనాడు అతను కోడిని కొని, వండుకుని తిన్నాడు. దాంతో అతనికి ప్రాణం లేచివచ్చినట్టయింది. సుఖంగా తినటానికి కాకపోతే ఎంతో శరీర కష్టం చేసి డబ్బు సంపాదించినందుకు ఫలితం ఏమిటి?

అయినా ఒకవంక తాను పొదుపు నియ మాన్ని ఉల్లంఘించినందుకు మనస్సు బాధ పడింది. అందుచేత అతను మళ్ళీ కొన్నాళ్లు అన్నమూ, ఎండుచేపలూ తింటూ గడిపాడు. కాని అది భోజనం లాగానే లేదు. కోడి రుచి అనుక్షణమూ జ్ఞాపకం వచ్చేది.

చివరకు గణేశుడి జిహ్వాచాపల్యమే గెలిచింది. అతను తన దగ్గిర ఉన్నదంతా రుచిగా తినటానికే ఖర్చు చేయసాగాడు. తిండి సుఖంతో మిగుల్చుకున్న డబ్బంతా అయిపోవటం అలా ఉంచి, అతనికి పనికి ఒళ్ళు వంగకుండా పోయింది. దీని ఫలి తంగా అతను అన్నమూ, ఎండుచేపలూ



కొనటానికి కూడా తగినంత సంపాదించు కోలేని స్థితికి వచ్చేశాడు.

ఈ లోపల గంగాధరుడు పొదుపు నియమంతో బాగుపడ్డాడు. అతను ప్రతి రాగి దమ్మిడీ కూడా ప్రాణంతో సమంగా ఎంచి, తన కష్టార్జితాన్ని కూడబెట్టి, చిన్న చిన్న వ్యాపారాలతో ప్రారంభించి, క్రమంగా పెద్ద వర్తకానికి ఎగబాకి, అందులో త్వరగా పైకి వచ్చి, కొంత ఆస్తి సంపాదించుకుని, ఇల్లు కట్టుకుని, పెళ్ళి చేసుకున్నాడు.

తనతో బాటే కట్టుబట్టలతో వచ్చిన గంగాధరుడు తానున్న నగరంలోనే ధనికుడుగా బతుకుతున్న సంగతి గణేశుడికి తెలుసు. అందుచేత తన మిత్రుడి సహాయం పొందుదామన్న ఉద్దేశంతో అతను గంగాధరుడి ఇంటికి వెళ్ళి, తనకు అదృష్టం కలిసి రాలేదనీ, తనకు పూటకింత అన్నమూ, ఎండు చేపలూ కూడా కరువయాయనీ మొరపెట్టుకున్నాడు.

"నీకా అన్నమూ, ఎండుచేపలూ అందేటట్టు నేను చూస్తాను. నువు నీ కాళ్ళ మీద నిలబడు," అని గంగాధరుడు గణేశుడికి తన ఇంటి ఆవరణలో ఒక చిన్న గుడిసె వేయించి ఇచ్చి, రోజూ బియ్యమూ, ఎండు చేపలూ అతనికి పంపుతూ వచ్చాడు. వాటితో గణేశుడు వంట చేసుకు తింటూ వచ్చాడు.



కొద్ది రోజులు గడిచాక గంగాధరుడు గణేశుణ్ణి పిలిపించి, "రోజూ ఎండుచేపలు తినటం నీకు చవిచచ్చినట్టుగా ఉంటున్న దేమో! ఒక పని చెయ్యి. నా చింత తోపులో కెల్లా చిన్న చింతమొక్కను నీకు ఇచ్చేస్తాను. దాని ఆకు తెచ్చి, చేపల కూరలో వేసి ఉడకబెట్టావంటే రుచిగా ఉంటుంది. ఆ పనిచెయ్యి," అన్నాడు.

గణేశుడు తన మిత్రుడి చింతలతోపుకు వెళ్ళి, అక్కడ ఉన్న మొక్కలలో చిన్న దానినుంచి ఆకు దూసుకువచ్చి చేపల కూరలో వేశాడు. కూర రుచిగానే ఉన్నది. అయితే కొద్ది రోజులకల్లా చింతమొక్కన ఒక్క ఆకు కూడా లేకుండా పోయింది.

గణేశుడు తన మిత్రుడి వద్దకు వెళ్ళి, మరొక చింతచెట్టు నుంచి ఆకు కోయటానికి అనుమతి కోరాడు.

"ఈ సారి ఉన్న చెట్లన్నిటిలోకీ పెద్ద చెట్టు నుంచి ఆకు కోసుకో," అన్నాడు గంగాధరుడు. మళ్ళీ కొన్నాళ్ళు గడిచాయి. గంగాధరుడు గణేశుణ్ణి పిలిచి, "నువు, కోసుకునే చెట్టున చింతాకు అయిపోలేదు గద?" అన్నాడు.

"నేను రోజుకు గుప్పెడు ఆకు కోస్తే ఆ చెట్టున మర్నాటికి రెండు గుప్పెళ్ళు చిగురు పెట్టుకొస్తుంది," అన్నాడు గణేశుడు.

"నువు చేసినదానికీ, నేను చేసినదానికీ అంతే తేడా! నువు నీ ఆర్థికస్థితి చిన్న మొక్కగా ఉండగానే దాన్ని దోచావు. నేను పెద్దచెట్టు అయేదాకా ఓపికపట్టి, దానినుంచి నాకు కావలిసినదంతా అనుభవించగలుగు తున్నాను. నీ జీవితం మోడుబారిపోయింది. నా జీవితం మూడు పూలూ, ఆరు కాయ లూగా ఉన్నది," అన్నాడు గంగాధరుడు.

"అవును! ఇక నేను నీ మీద ఆధార పడక, మళ్ళీ జీవితం ప్రారంభిస్తాను," అని గణేశుడు తన స్నేహితుడు చెప్పిన నీతిని అమలు చేయటానికి పూనుకున్నాడు.





# హడావుడి మనిషి

ఒక గ్రామంలో రామయ్య అనే పౌరోహిత్యపు బ్రాహ్మడు ఉండేవాడు. ఆయన వట్టి హడావుడి మనిషి.

పొరుగు గ్రామంలో ఒక పెళ్ళి ముహూర్తం వచ్చింది. పౌరోహిత్యానికి రామయ్యను పిలిచారు. హడావుడి మనిషి కావటంచేత రామయ్య కోడికూయక ముందే లేచి, పక్క గ్రామానికి బయలుదేరుతూ తన భార్యతో, "ఒసే, నేను బయలుదేరుతున్నాను. తలుపు వేసుకో. దొంగలు రావచ్చు. జాగ్రత్త!" అన్నాడు.

రామయ్య భార్య లేచి, తలుపు గడియ వేసి వచ్చి మళ్ళీ పడుకున్నది.

ఇదంతా దొంగలు గమనించారు. వాళ్ళకు తెల్లవార్లూ ఏదీ దొరకలేదు. రామయ్య వెళ్ళిపోయాడు. ఇక ఇంట్లో ఆయన భార్య తప్ప ఇంకెవరూ లేరు. ఇంకా ఝాము రాత్రి మిగిలి ఉన్నది. రామయ్య ఇంటికి కన్నం వేస్తే ఇంకేమీ దొరక్కపోయినా, బియ్యమైనా దొరుకుతాయి.

ఆ మాట అనుకుని దొంగలు రామయ్య ఇంటికి కన్నం వేసి లోపల ప్రవేశించారు. లోపల దీపం కూడా లేదు. కటికచీకటి. అదీ మంచిదే అనుకున్నారు దొంగలు.

ఇంతలోనే రామయ్య వెనక్కు వచ్చి, తలుపు తట్టి భార్యను పిలిచాడు. భార్య వెళ్ళి తలుపు తీసింది.

"తలగుడ్డ మరిచిపోయాను," అని రామయ్య తలగుడ్డ తీసుకుని మళ్ళీ బయలుదేరాడు. రామయ్య భార్య తలుపు గడియ పెట్టి వచ్చి, మళ్ళీ పడుకున్నది.

ఆమెకు కాస్త కునుకు పట్టటానికి వ్యవధి ఇచ్చి దొంగలు చీకట్లో బియ్యం బాన ఎక్కడ ఉన్నదీ తడివి చూసి, దానిపక్కనే ఒక గుడ్డ పరిచారు. బియ్యం అందులో పోసుకుని తీసుకు పోదామని వాళ్ళ ఉద్దేశం.

కురలి శాయిబాబు

ఇంతలో రామయ్య మళ్ళీ హడావుడిగా వెనక్కు వచ్చి, తలుపు తట్టుతూ భార్యను పిలిచాడు.

భార్య వెళ్ళి తలుపు తీసి, "ఈసారి ఏం మరిచారు?" అన్నది.

"సంచీ! సంచీ మరిచాను. కాస్త వెళ్ళి తీసుకురా!" అన్నాడు రామయ్య.

రామయ్య భార్య బియ్యపు బాన పక్కగానే వెళ్ళి ఒంకెనున్న సంచీ తీసుకుని భర్తకిచ్చి, తలుపు మూసింది. సంచీ కోసం ఆమె వెళ్ళేటప్పుడు దొంగలు దూరంగా తప్పుకుని నక్కవలిసి వచ్చింది. ఆమె కాలికి గుడ్డ తగలటమూ, దాన్ని ఆమె తీసుకుని వెళ్ళి కప్పుకుని పడుకోవటమూ వాళ్ళు ఎరగరు.

ఆమెకు కాస్త కునుకు పట్టటానికి వ్యవధి ఇచ్చి, దొంగలు బానలో నుంచి బియ్యం ఎత్తి, లోగడ గుడ్డ పరిచి ఉండవలిసిన చోట పోశారు.

బాన దాదాపు ఖాళీ అయింది. బియ్యం మూట కట్టటానికి గుడ్డ చెంగుల కోసం నేల మీద ఎంతసేపు తడివినా అవి దొరకలేదు. తాము నేలమీద బియ్యం పోసిన సంగతి వాళ్ళకు తెలిసి వచ్చింది.

ఇప్పుడేం చెయ్యాలా అని వాళ్ళు అనుకుంటూండగా హడావుడి రామయ్య మూడో సారి తిరిగివచ్చి, తలుపు తట్టాడు.

భార్య వెళ్ళి తలుపు తీసి, "అప్పుడే తెల్లారిపోయిందే! ఇక నేను పని ప్రారంభించవచ్చు." అన్నది.

ఈ మాటలు విని దొంగలు హడలిపోయి కన్నంలో నుంచి జారుకున్నారు. ఆ తొందరలో వాళ్ళు తమ వెంట ఉన్న డబ్బు సంచీ రామయ్య ఇంటనే వదిలేసి పోయారు.

రామయ్య ఈ సారి తాను తీసుకు పోవలిసిన వస్తువులన్నీ శ్రద్ధగా తీసుకుని, సకాలానికే పొరుగూరు చేరాడు. ఆయన హడావుడి ఈ సారికి ఎంతో లాభించింది.





# శిధిలాలయం

## 31

[వృశ్చికనాయకుడు శిఖిముఖితో కలియబడి ఓడిపోయాడు. శిఖిముఖి అతన్ని క్షమించి కొండ కింది లోయలోకి బయలుదేరాడు. అక్కడ వాళ్ళు చెట్టు కింద వున్న ఒక ఏనుగుల మందను పారదోలారు. చెట్టు పైన కనిపించే ఆకారం నాంగ్‌సోమ్ దేమో అన్న అనుమానం కలిగి జాంగ్‌లా గబగబా చెట్టు పైకి ఎగబాకి పోయాడు. తరవాత—]

శిఖిముఖివాళ్ళు చెట్టు కింద నిలబడ్డారు. జాంగ్‌లా గుబురుగా వున్న కొమ్మల్లోంచి ఆశ్చర్యంగా చిన్న కేక పెట్టి, "శిఖి దొరా! ఇక్కడున్నది నాంగ్‌సోమే! స్పృహ లేదు, కాని ఊపిరాడుతున్నది. మరొకళ్ళిద్దర్ని పంపితే, జాగ్రత్తగా కిందికి దించవచ్చు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే వృశ్చికజాతివాళ్ళిద్దరు చెట్టెక్కారు. తరవాత కొద్ది సేపటికి జాంగ్‌లా, వాళ్ళిద్దరూ కలిసి చచ్చినట్టు పడివున్న నాంగ్‌సోమ్‌ను లతలు పెనవేసి కట్టిన తాళ్ళతో నిదానంగా నేల మీదికి జార్చారు.

శిఖిముఖి, విక్రమకేసరి కలిసి నాంగ్‌సోమ్ బతికివున్నాడో లేదో అని పరీక్షించబోయేంతలో, వృశ్చికనాయకుడు అల్లంత దూరంలో వున్న పొదలోంచి యింత ఆకు తెచ్చి, దాని పసరును నాంగ్‌సోమ్



ముక్కుల్లో పోశాడు. మరుక్షణమే నాంగ్ పెద్దగా తుమ్మి, ఎగిరి లేచి కూర్చున్నాడు.

"నాంగ్! కొండమీది నుంచి లోయ లోని చెట్టుకొమ్మల మీద పడి చిన్న దెబ్బలు తగిలినా, ప్రాణాలతో బయటపడ్డావ్!" అన్నాడు శిఖిముఖి.

నాంగ్‌సోమ్ పిచ్చివాడిలా చుట్టూ వున్న వాళ్ళనేసారి కలయచూసి, "శిథిలాలయం! శిథిలాలయం! అదుగో!" అంటూ గుంపుగా వున్న చెట్ల కేసి చేయిచూపి, లేచి పరిగెత్తబోయాడు.

శిఖిముఖి అతడి నడుం పట్టుకుని బలవంతాన కూర్చోబెట్టి, విక్రమకేసరితో, "నాంగ్‌సోమ్‌కు యింకా ఆ వెర్రివెలగ పండు విషం దిగినట్టు లేదు. ఏమిటి చేయటం?" అన్నాడు.

విక్రమకేసరి ఏదో చెప్పబోయేంతలో, చెట్లల్లో నుంచి, "రక్షించండి! రక్షించండి!" అన్న కేకలు వినిపించినై.

అందరూ అటుకేసి తలలు తిప్పారు. ఎర్రగండు పెద్దగా మొరిగింది. శిఖిముఖి ఆశ్చర్యంగా, "అది పిశాచం అరుపా? లేక శిథిలాలయ పూజారి కంఠధ్వనా?" అంటూ కత్తిదూసి, ఆ ఆర్తనాదం వచ్చిన దిక్కుగా బయలుదేరాడు.

వటవృక్షాల నీడల్లో నుంచి శిఖిముఖి వెలుగులోకి వచ్చి ఆర్తనాదం వచ్చిన దిక్కు కేసి పరీక్షగా చూసేంతలో తిరిగి, "రక్షించండి!" అన్న అరుపు వినబడింది. ఈసారి ఆ కంఠ స్వరంలో మొదట వున్న పృథత్వం లేదు; కొనఊపిరితో వున్నవాడి మూలుగులా వున్నది.

"కేసరీ! ఆ గొంతు శిథిలాలయ పూజారిదే, అనుమానం లేదు. వాడు నిజంగానే ఏదో ప్రమాదంలో చిక్కుకున్నట్టున్నది," అన్నాడు శిఖిముఖి.

కేసరి జవాబివ్వబోయేంతలో ఎర్రగండు పొదలమీంచి దూకి ముందుకు పోయి

పెద్దగా మొరగసాగింది. అందరూ దాని వెనకగా పొదల్లో నుంచి బయటికి వెళ్ళారు. వాళ్ళకు అక్కడ కనబడిన దృశ్యం భయాశ్చర్యాలను కలిగించింది.

ఒక పెద్ద సర్పం శిథిలాలయ పూజారిని దాదాపు మోకాళ్ళవరకు మింగింది. పూజారి రెండు చేతులతోనూ నేలమీద వున్న ఏదో వస్తువును గట్టిగా పట్టుకుని, అటూయిటూ కదులుతూ పెద్దగా అరిచేందుకు ప్రయత్నిస్తున్నాడు.

"ఈ పూజారి ఎంత దుర్మార్గుడైనా, వీణ్ణి, పాము బారినుంచి రక్షించటం మన కనీస మానవధర్మం," అంటూ శిఖిముఖి పరుగు పరుగున ముందుకు పోయి, కత్తితో పాము నడుం మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు పాము అటూయిటూ పొర్లింది. దాని నోటిలో వున్న శిథిలాలయ పూజారి బయటపడ్డాడు. శిఖిముఖి వెంట వున్న వృశ్చిక జాతివాళ్ళు తమ చేతుల్లో వున్న రాతి ఆయుధాలతో పామును ఎడాపెడా బాదసాగారు.

శిఖిముఖి, విక్రమకేసరీ పూజారిని సమీపించారు. పాము నోటి నుంచి బయట పడిన అతడి కాళ్ళు రెండూ రక్తం ఓడుతున్నవి. పాదాల ఆకారమే పూర్తిగా మారిపోయింది: అవి మాంసపు ముద్దల్లా ఎర్రగా





మెరుసున్నవి. పూజారి బాధతో గిలగిల కొట్టుకుంటూ పెద్దగా మూలుగుతున్నాడు. అతడి చేతులు మాత్రం ఏదో వసువును బలంగా పట్టుకునే వున్నవి.

శిఖిముఖి వంగి అతణ్ణి లేవనెత్త బోయేంతలో పూజారి చిన్నగా అరిచి, "శిఖీ, నన్నిక్కడే చావనియ్యి. నేనెలాగైతేనేం, చచ్చే ముందు శిథిలాలయాన్ని కనుక్కొన్నాను! నా మంత్రశక్తి, శిథిలేశ్వరి పై నా భక్తి వృథాపోలేదు," అన్నాడు.

"నువ్వు శిథిలాలయాన్ని కనుక్కొన్నావా! ఎక్కడుందది? మా కంటికి కనబడదేం! చావబోయే ముందు కూడా ఎందుకు దంభాలు పలుకుతావు?" అన్నాడు శిఖిముఖి కొంచెం కోపంగా.

శిఖిముఖి అలా అనగానే, పూజారి తల ఎత్తి సూటిగా అతడి కళ్ళల్లోకి చూశాడు. తరవాత ఒక క్షణం ఆగి, "నేను దుర్మార్గుణ్ణనీ, మోసగాణ్ణనీ నీ అభిప్రాయం! అంతేనా? నేను శిథిలేశ్వరి కోసమే తుచ్ఛ మానవులు కొందరికి హాని కలిగించ వలసి వచ్చింది. ఆ దేవి ముందు యీ మానవు లెంత! ఇదిగో, శిథిలాలయపు గోపుర కలశం! చూడు!" అంటూ చేతులు రెండూ పైకెత్తాడు.

అంతవరకూ శిఖిముఖీ, విక్రమకేసరీ పూజారి చేతులతో బలంగా పట్టుకుని వున్న వసువు కేసి చూడలేదు. ఇప్పుడు వాళ్ళకు సూర్యకాంతిలో ధగధగ మెరుస్తున్న కలశం ఒకటి కంట బడింది. వాళ్ళక్కలిగిన ఆశ్చర్యం అంతాయింతా కాదు. ఆ కలశాన్ని చూస్తూనే వృశ్చికజాతి వాళ్ళందరూ నేల మీద మోకరిల్లారు.

ఒకటి రెండు క్షణాలు ఎవరి నోటి నుంచీ మాట వెలువడ లేదు. శిఖిముఖికి యిదేదో శిథిలాలయ పూజారి తమ మీద ప్రయోగించిన కనుకట్టు విద్య ఏమో అన్న అనుమానం కలిగింది. విక్రమకేసరి ఏమాలో

చించాడో ఏమో, కలశాన్ని రెండు చేతుల తోనూ బలంగా పట్టుకుని పైకెత్తాలని చూశాడు. కాని అది కదలలేదు.

అంత ప్రాణాపాయ స్థితిలోనూ శిథిలాలయపూజారి అది చూసి, వికవిక మంటూ నవ్వి, "ఆ కలశమేదో నేలమీద పళ్ళెంలా బోర్లించి వున్నదనుకుంటున్నావా, చినకేసరీ! ఇప్పుడు చెపుతున్నాను. నేను నీ తాత నెరుగుదును. ఆయనలో వున్న మొండితనం నీలోనూ వున్నది." అన్నాడు.

"నువ్వనేదేమిటి, పూజారీ! శిథిలాలయం గోపుర కలశం వరకూ భూమిలో కూరుకు పోయిందనా?" అని అడిగాడు శిఖిముఖి.

"ఎన్నో ఏళ్ళ క్రితం భూకంపం కారణంగా అదే జరిగింది. ఆలయం కొన్ని అడుగుల లోతు భూమిలోకి దిగిపోయింది. పక్కన వున్న కొండరాళ్ళు దొర్లి దాన్ని కప్పివేసినై. ఆ రాళ్లూరప్పలూ తొలగించావంటే శిథిలాలయం, అందులోని శిథిలేశ్వరీ దేవీ కనబడుతుంది, శిఖీ! అయినా మీ శబర జాతివాళ్ళకు ఆ దేవితో పనిలేదు గదా, అక్కడ దొరికే బంగారం తప్ప!" అన్నాడు పూజారి యీసడిస్తున్నట్టుగా.

శిఖిముఖి, విక్రమకేసరి కేసి చూశాడు. చావబోయే ముందు కూడా శిథిలాలయ



పూజారి తమ మీదకు ఇభ్యజాతివాళ్ళనూ, వృశ్చికజాతివాళ్ళనూ రెచ్చకొట్ట చూస్తున్నాడని వాళ్లిద్దరూ గ్రహించారు. పూజారిని ఏమి చేయటమా అని వాళ్లు ఆలోచించేంతలో, నాంగ్‌సోమ్ అడుగులో అడుగు వేసుకుంటూ కలశం దగ్గిరకు వచ్చి, రెండు మూడు క్షణాలు కన్నార్పకుండా చూసి దాన్ని తాకాడు. ఆ వెంటనే అతడిలో ఏదో కొత్త శక్తి ప్రవేశించినట్టయింది.

నాంగ్‌సోమ్ ఒకసారి పెద్దగా నిట్టూర్చి, "కేసరిదొరా! ఇప్పటికి నాకు వెర్రివెలగ పండు తిక్క వదిలిపోయింది. ఈ కలశంలో ఏదో మహత్తున్నది. దీని అడుగున ఆలయం





నాంగ్‌సోమ్, శిఖిముఖి అభిప్రాయం ఏమిటో గ్రహించినవాడిలా నవ్వుతూ ముందుకు వచ్చి రహస్యం చెపుతున్న వాడిలా, "కాళ్లు రెండూ నజ్జు నజ్జయి పోయిన పూజారి వాయకమ్మి త్వరలోనే చస్తాడు. వాడి మాటలు మీరు పట్టించు కోకండి—నాకూ, యీ కలశం శిథిలాల యానికి సంబంధించినదే అన్న నమ్మకం వున్నది," అన్నాడు.

"మనం యిక్కడ గుట్టగా పడిపోయిన చిన్నా పెద్దరాళ్ళను ఎత్తి దూరంగా పారేస్తే తప్ప వాటి అడుగున వున్న ఆలయాన్ని చేరలేం. ఇది చాలా రోజులమీద జరగ వలసిన పని. మనం యీ దాపులనే నివా సాలు ఏర్పరుచుకోవలసి వుంటుంది. అందుకు అవసరం అయిన ఇళ్ళు కొమ్మ లతో, ఆకులతో ముందు నిర్మించుకుని, తరవాత యీ పని ప్రారంభిద్దాం," అన్నాడు శిఖిముఖి.

నాంగ్‌సోమ్ తలవూపి వృశ్చికజాతివాళ్ళ కేసి చూశాడు. వృశ్చికనాయకుడు చేతులు కట్టుకుని శిఖిముఖి ముందుకు వచ్చి నిల బడ్డాడు. శిఖిముఖి అతడు చేయవలసిన పని చెప్పాడు. వాడు అంతా విని, "శిఖి దొరా! ఆ ఇల్లు కట్టటం ఏమంత పెద్ద

వున్నదనేందుకు సందేహం లేదు. రాళ్లూ రప్పలూ తొలగిద్దాం," అన్నాడు.

"ఇది చాలా కష్టంతో కూడిన పని. అయినా తప్పదు. ఏమంటావ్, శిఖీ?" అని అడిగాడు విక్రమకేసరి.

"ఎంత కష్టకార్యమైనా మనం సాధించి తీరవలసిందే. ఇంతదూరం వచ్చి శిథిలా లయంలో ప్రవేశించకుండా ఎలా వెళ్ళటం? మీ తాతగారి ఆత్మకు శాంతి కలిగించవద్దా? మీ తండ్రిగారి ఆజ్ఞ నెరవేర్చవద్దా? కాని యీ పూజారి మాట ఏమిటి? వీడి బంట్లు ఎక్కడ? తనవాళ్ళను ఉసికొల్ప జూస్తు న్నాడు," అన్నాడు శిఖిముఖి.



పనికాదు. మాతమందిరాన్ని కప్పినరాళ్లను తొలగించటమే బహుకష్టం. ఒకటి రెండు మచ్చిక చేసిన ఏనుగులుంటే పని చులకన అవుతుంది." అని శిథిలాలయ పూజారిని వేలితో చూపుతూ, "వాడు ఎలానూ చస్తాడు. కాని మందూ మాకూ లేకుండా చావనివ్వటం బావుంటుందా?" అన్నాడు.

"చాతైతే ఏదైనా చికిత్స చేసి వాడి బాధ కాస్త తగ్గించండి. నేనా మాటే మరి చాను," అన్నాడు శిఖిముఖి.

వృశ్చికజాతి నాయకుడు చెప్పగానే అతడి అనుచరులు చెట్లల్లోకి పోయి ఏవో ఆకులూ అవీ తెచ్చి పూజారి కాళ్ళకు కట్లు కట్టబోయారు. పూజారి గట్టిగా అభ్యంతరం చెపుతూ, అల్లంత దూరంలో వున్న ఒక చెట్టుకొమ్మకు ఉయ్యాల వేసి తనను అందులో కూర్చోబెట్టమన్నాడు.

"నేను మరి నాలుగైదు సూర్యోదయాల కంటె ఎక్కువ చూడలేను. ఈ లోపల మీరు శిథిలాలయాన్ని వెలికి తీయండి. శిథిలేశ్వరిని చూసి సుఖంగా ప్రాణాలు వదులుతాను," అన్నా డతను.

చావబోయేవాడి కోర్కె నెరవేర్చటం ధర్మం అని శిఖిముఖి, విక్రమకేసరీ వృశ్చిక జాతివాళ్ళకు అలాగే చేయమని చెప్పారు.



వాళ్ళు శిథిలాలయ పూజారి కాళ్ళకు కట్లు కట్టి, దాపులనున్న ఒక చెట్టుకొమ్మకు అమర్చిన ఉయ్యాలలాంటి దాంట్లో అతణ్ణి కూర్చోబెట్టారు.

ఆ సాయంకాలాని కల్లా అందరూ కలిసి చెట్లకొమ్మలు నరికి భూమిలో పాతి, వాటి మీద పెద్దపెద్ద ఆకులు కుట్టి, వృశ్చికజాతి వాళ్లూ, శిఖిముఖీ అతడి అనుచరులూ వుండేందుకు వీలుగా చిన్న చిన్న గుడిసెల్లాంటివి తయారుచేశారు. ఆ రాత్రి వాళ్లెవరికీ సరిగా నిద్రల్లేవు. చుట్టూ అడవి ఏనుగులు ఘీంకరించటం, క్రూర మృగాల అరుపులూ వాళ్ళ కర్ణపుటాలను బద్దలు

చేయసాగినై. గుడిశెల చుట్టూ నెగళ్ళు వేసుకుని, కునికిపాట్లు పడుతూ వాళ్ళు సూర్యోదయం వరకూ కాలంగడిపారు.

మరసటి రోజు సూర్యోదయం నుంచీ అందరూ కలిసి పెద్ద పెద్ద రాళ్ళకు అడవి తీగలతో అల్లిన మోకులు బిగించి కట్టి, దూరంగా లాక్కు పోయి గుట్టగా వేయ సాగారు. అది ఎంతో శ్రమతో కూడిన పని. దానికి అంతరాయం కలిగిస్తూ, మధ్య మధ్య అడవి ఏనుగులు కొన్ని అక్కడికి వచ్చి ఘీంకరిస్తూ వాళ్ళ మీద పడేందుకు ప్రయత్నించ సాగినై. అలాంటి సమయాల్లో అందరూ పనులు మాని ఏనుగులను బెదర కొట్టేందుకు డప్పులు వాయించటం, రాళ్ళు విసరటం చేయసాగారు.

సూర్యుడు పడమటి దిక్కుకు వాలే వరకూ వాళ్ళ పనికి పెద్ద ఆటంకం ఏమీ కలగ లేదు. శిఖిముఖి యిక ఆ నాటికి పని విరమించి, వంటపనుల సంగతి చూద్దాం అనుకునేంతలో, హఠాత్తుగా ఆ ప్రదేశానికి చుట్టూ వున్న గుట్టల మీద నాలుగు ఏనుగులు కనిపించినై. వాటిమీద పెద్దపెద్ద త్రిశూలాలు ధరించిన భయంకరాకారులున్నారు.

శిఖిముఖి, విక్రమకేసరీ తమ అనుచరుల్ని హెచ్చరించి ఆయుధాలు చేత పట్టబోయేంతలో, ఏనుగుల మీద వున్నవాళ్లు పెద్దగా, "ఎక్కడి వాళ్ళక్కడ కదలకుండా నిలబడండి. మా వెనక నూరు ఏనుగుల మీద మరికొందరు అఘోరీలు వస్తున్నారు. పారిపోజూస్తే మీ ప్రాణాలు దక్కవు. జాగ్రత్త!" అన్నారు.

శిఖిముఖి, విక్రమకేసరీ యిప్పుడు ఏమి చేయుటమా అని, నాంగ్‌సోమ్ కేసీ, వృశ్చిక నాయకుడి కేసీ తలలు తిప్పారు. వాళ్ళిద్దరూ తమ చేతుల్లోని ఆయుధాలు పైకెత్తి త్రిశూలాలు ధరించిన వాళ్ళ కేసి బయలుదేరారు. —(ఇంకా వుంది)





# అర్థంలేని ప్రవర్తన

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, ఈ అపరాత్రి వేళ నువు ఎందు కిలా శ్రమపడుతున్నావే నాకు తెలియదు. అయినా నేను ఆశ్చర్య పడను. ఎందుకంటే, కొందరి ప్రవర్తనకు అర్థమేమీ ఉండదు. ఇందుకు నిదర్శనంగా నీకు తరుణు డనే యువకుడి కథ చెబు తాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

తరుణుడు అనే యువకుడికి దగ్గిర బంధువు లెవరూ లేరు. అతను చిన్నతనం లోనే గురుకులానికి వెళ్ళి, అక్కడ విద్యా భ్యాసం చేసి, తన స్వస్థలమైన విభావస్థలా నికి బయలుదేరాడు. అక్కడ పెళ్లిచేసుకుని, జీవనోపాధి కల్పించుకుని, స్థిరపడాలని

బేతాళ కథలు



అతని ఉద్దేశం. విభాసస్థలం గొప్ప పుణ్య క్షేత్రం. ఊరికి తూర్పుగా ఎత్తయిన కొండ మీద చాముండీఆలయం ఉన్నది. అక్కడికి రోజూ యాత్రికులు వస్తూ ఉంటారు. తరుణుడి లాంటి విద్యావంతుడికి జీవనోపాధి అతి సులువుగా ఏర్పడుతుంది.

తరుణుడు గురుకులం నుంచి వస్తూండగా ఒక గ్రామం వెలపల అతనికొక గుంపు కనడింది. వాళ్ళేదో వింత చూస్తున్నారు. అదేమిటో చూదామని తరుణుడు ఆ గుంపును సమీపించాడు. అక్కడ కనిపించిన దృశ్యం అతనికి చాలా జుగుప్స కలిగించింది.

ఒక మొరటు మనిషి ఒక పంగలకర్రతో ఒక పామును నేల కేసి అదిమిపెట్టి, మధ్య మధ్య కర్ర ఎత్తి పామును కొంత దూరం పోనిచ్చి, మళ్ళీ కర్రతో పట్టుకుంటున్నాడు. వాడా పాముతో అలా క్రూరంగా ఆడుకుంటూ ఉంటే ప్రేక్షకులు కేరింతాలు కొట్టి నవ్వుతున్నారు.

ఆ మొరటుమనిషిని చూసి తరుణుడికి చాలా ఆగ్రహం వచ్చింది. వాడు తన కన్న రెట్టింపు బలాఢ్యుడై పోయాడు గాని, లేకపోతే తరుణుడు వాణ్ణి చితకతన్ని ఉండును.

అతను తన ఆగ్రహాన్ని అణచిపెట్టుకుని, "ఆ పామును అమ్ముతావా ఏమిటి?" అని అడిగాడు.

మొరటువాడు తల ఎత్తి చూసి, "పామును కొంటానంటాడు, ఎవరీ బ్రహ్మచారి?" అన్నాడు వెటకారంగా.

తరుణుడు తన దగ్గిర ఉన్న కాసిని చిల్లర డబ్బులూ మొరటువాడి కేసి చూపాడు.

"పాము కోసం మోజుపడ్డావు తీసుకుపోయి ఆడుకో!" అంటూ మొరటువాడు ఒక చేత్తో డబ్బులు తీసుకుని, రెండోచేత్తో పాము మెడ పట్టి ఎత్తి, తరుణుడి చేతుల్లోకి దాన్ని తోశాడు.




ఏదో పాము మీద తన జాలి బయట పెట్టి అక్కడ వున్నవారి దృష్టిలో తాను హాస్యాస్పదంగా ప్రవర్తించానేమో నన్న అనుమానమూ, తన దగ్గిర ఉన్న కాస్త డబ్బూ ఖర్చయిపోయిందన్న బాధా తరుణుణ్ణి కలవరపెట్టాయి. అందుచేత, అతనా పామును తీసుకుని గబగబా నడుచుకుంటూ అక్కడి నుంచి ముందుకు సాగిపోయాడు. అతను కొంత దూరం వెళ్ళి, ఎవరూ లేని చోట ఆ పామును నేల మీద వదిలివేశాడు. అది చాలా అందమైన పాము. దాని రంగు తెల్లని తెలుపు. తరుణుడు వదలగానే అది చరచరా ఎటో వెళ్లిపోయింది.

ఇంతకూ ఈ పాము ఒక నాగకన్య. కారణాంతరం వల్ల నాగరాజు శిక్షించగా ఆమె భూమి మీద కొంత కాలం పాము రూపంలో తిరగవలసి వచ్చింది. శిక్షాకాలం పూర్తి కాగానే ఆమె తన ఇంటికి తిరిగి పోయింది. ఆమె తండ్రి ఆమెకు కలిగిన విపత్తు గురించీ, తరుణుడు ఆమెను కాపాడటం గురించీ తెలుసుకుని, "అమ్మా, నువ్వు ఆ యువకుడి ఋణం తీర్చుకోదలిస్తే భూలోకానిక తిరిగి వెళ్ళు," అన్నాడు.

"నే నతనికి భార్యగా జీవించాలని కోరుతున్నాను," అన్నది నాగకన్య.

అందుకు తండ్రి సమ్మతించి, ఆమె వెంట ఒక పరిచారికను ఇచ్చి పంపాడు. ఆ ఇద్దరూ విభాసస్థలానికి చేరుకున్నారు. తరుణుడు ఆమెను చూసిన క్షణంలోనే గాఢంగా ప్రేమించాడు. ఆమెకు పెళ్లి కాలేదని తెలుసుకుని, తనను పెళ్ళాడమన్నాడు. ఆమె వెంటనే ఒప్పుకున్నది.

తరుణుడికీ, రూపవతి అని పేరు పెట్టుకున్న నాగకన్యకూ వివాహం జరిగింది. రూపవతి సౌందర్యం తరుణుడికి మొదటి నుంచీ ఆశ్చర్యకరంగానే ఉన్నది. ఎంత కాలం ఆమెతో కాపరం చేసినా అతని విస్మయం కొంచెం కూడా తగ్గలేదు. ఆమె



సాధారణ మానవస్త్రీ కాదన్న విషయం అతనికి తట్టలేదు.

రూపవతి పరిచారిక పనిమనిషిగా ఉండేది. తరుణుడు తన భార్యను ప్రాణం కన్న ఎక్కువగా చూసుకుంటూ, ఏ పూర్వ జన్మ పుణ్యం చేతనో తనకు ఆమె భార్యగా దొరికిందని తృప్తిపడుతూ వచ్చాడు.

ఇలా ఉండగా, చాముండీ ఆలయ పూజారి ఒకనాడు రూపవతిని చూడటం తటస్థించింది. ఆయన ప్రసిద్ధుడైన తాంత్రికుడూ, మంత్రవేత్తానూ. అందుచేత, రూపవతిని చూస్తూనే ఆమె నాగస్త్రీ అని ఆయన కనిపెట్టాడు. ఆయన తరుణుణ్ణి తన వెంట కొంత దూరం రమ్మని, ఇంటి నుంచి బయలుదేరతీసి, "నాయనా, చేసుకోక, చేసుకోక నాగస్త్రీని భార్యగా చేసుకున్నావేమిటి?" అన్నాడు.

తరుణుడి నెత్తిన పిడుగు పడ్డట్టయింది. "మీరు హాస్యమాడుతున్నారా? లేక, ఇది నిజమా?" అన్నా డతను.

"ఇది హాస్యమాడే విషయమా, బాబూ? ఇంత చదువుకున్నవాడివి, ఆమె మామూలు మానవస్త్రీ కాదని ఎలా తెలుసుకోలేక పోయావు?" అన్నాడు పూజారి.

తరుణుడి గుండెలో దడపుట్టుకొచ్చింది. నాగజాతివారు ఏదో దురుద్దేశం లేకుండా మానవులతో సంబంధాలు పెట్టుకోరని అతను ఎన్నోసార్లు ఉదాహరణలతో సహా విని ఉన్నాడు.

"బాబుగారూ, నేను ఇంటికి తిరిగి పోలేను. నన్ను కూడా కొండ మీద, మీ ఇంట్లో ఉండనివ్వండి," అన్నాడు తరుణుడు పూజారితో.

"ప్రస్తుతానికి అదే మంచిది. కర్తవ్యం నింపాదిగా ఆలోచింతాం," అని పూజారి తరుణుణ్ణి కొండ మీదికి తీసుకుపోయాడు.

ఎంత పొద్దెక్కినా తన భర్త ఇంటికి తిరిగి రాకపోయేసరికి రూపవతి చాలా

కంగారు పడింది. ఆమె తన పరిచారికతో సహా వీధుల వెంట తిరుగుతూ, తన భర్తను గురించి కనపడినవారి నందరినీ అడిగింది. అతను కొండ మీదికి వెళ్లినట్టు తెలిసింది. నిప్పులు చెరిగే ఎండలో, రాతిమెట్ల మీద తన కాళ్ళు కాలి బొబ్బలెక్కుతున్నా లక్ష్య పెట్టక కొండ ఎక్కి, పూజారిని తన భర్త ఉంటే ఒక్కసారి మాటాడాలని కోరింది.

పూజారి ఆమెతో, "అమ్మాయీ, ఎందుకీ వృథాశ్రమ? నీ భర్త నిన్నిక చూడడు. అతని ఆశ వదులుకో!" అన్నాడు.

రూపవతి ఇంకేమీ మాటాడలేదు. చాటున ఉన్న తరుణుడు తన భార్యను చూశాడు. ఆమె తలవంచుకుని వెనక్కు తిరిగి, మెట్లు దిగి పోవటం అతని కంట పడింది.

రూపవతి తన చెలికత్తెతో సహా కొండ దిగి వచ్చి, చెట్ల కింద నీడలో కూర్చుని, కంటికీ మంటికీ ఏకధారగా ఏడవసాగింది.

ఇంతలో అటు కేసి పరిగెత్తుతూ ఎవరో వస్తున్న చప్పుడు వినిపించింది. ఆడవాళ్లిద్దరూ తలలెత్తి, రొప్పుతూ వస్తున్న తరుణుణ్ణి చూశారు. అతను అదే పరుగున రూపవతి వద్దకు వచ్చి, ఎవరన్నా చూస్తారేమో నన్న బిడియం కూడా లేకుండా తన భార్యను గాఢంగా కౌగలించుకున్నాడు. తరవాత ముగ్గురూ కలిసి ఇంటికి వెళ్లి



పోయారు. వారి జీవితం ఎప్పటిలాగే ఆనంద కరంగా సాగిపోయింది.

బేతాళుడీ కథ చెప్పి "రాజా, తరుణుడి ప్రవర్తనకు అర్థమేమిటి? తన భార్య నాగ జాతి దని తెలియగానే ఆమెను విసర్జించటా నికి నిశ్చయించుకున్నాడు గదా, ఆమె తన కోసం కొండమీదికి వచ్చినప్పుడు కూడా ఆమె ఎదటపడ నిరాకరించాడు గదా, అంత లోనే తన మనస్సు ఎందుకు మార్చుకుని, ఆమె వెనకనే పరిగెత్తాడు? చివరకు ఆమెతో ఎందుకు కాపరం చేశాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తరుణుడు అసాధారణ వ్యక్తి అయి ఉండి కూడా సాధారణ వ్యక్తి లాగా ప్రవర్తించే స్వభావం కలవాడు. అతను పామును మొరటువాడి నుంచి కాపాడటం మామూలు వాళ్ళు చేసే పని కాదు. కాని ఆ పని చేసినందుకు అతను సిగ్గుపడ్డాడు. అలాగే తన భార్య నాగజాతిది అని తెలిసినప్పుడు అతని ప్రవర్తన సామాన్యుడి ప్రవర్తన లాగే ఉన్నది. అయితే తన భార్య మిట్టమధ్యాహ్నపు ఎండలో తన కోసం మెట్లెక్కి రావటమూ, తాను ఆమెను చూడగోరలేదని తెలియగానే మారు మాటాడక తిరిగి పోవటమూ అతనిలో ఉండే అసాధారణ ప్రకృతిని రెచ్చగొట్టాయి. తనకు కీడు చేయదలిచిన మనిషి అయితే రూపవతి అలా తిరిగి వెళ్ళిపోదు; ఏవో బొల్లికబుర్లతో వంచన చేసి తనను వశ పరుచుకుంటుంది. తాను విడిచిపుచ్చుతున్న భార్య స్వభావం ఎంత ఉత్తమమైనదో గ్రహించగానే తరుణుడి మనస్సు మారి పోయింది. ఆమె పిశాచిని అని తెలిసినా అతను ఆమెను విడిచిపుచ్చడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)






# ఆకాశానికి గుంజలు

ఒక ఊళ్ళో భీమన్న అనేవాడు ఒకడు ఉండేవాడు. వాడికి లోకజ్ఞానం బొత్తిగా లేదు. వాడికి పెళ్ళామూ, పిచూ ఏమీ లేదు. కూలిపని చేసి బతుకుతూ ఉండేవాడు. వాడికి బుద్ధిబలం శూన్యమైనా కండబలం ఉండేది. ఊళ్ళోవాళ్ళు వాణ్ణి వెట్టి అమాయకుడి కింద జమకట్టేవాళ్ళు.

ఒక రాత్రి భీమన్న తిండి తిని, వెన్నెట్లో మంచం వేసుకుని, వెల్లికిలా పడుకుని ఆకాశం కేసి చూశాడు. అకస్మాత్తుగా వాడి కొక భయంకరమైన ఊహ తట్టింది:

"ఆకాశం, ప్రపంచానికి దేవుడు వేసిన పందిరి అంటారు గదా! ఎంత చిన్న పందిరి కన్నా నాలుగు గుంజ లుంటాయి గదా! ఇంత పెద్ద ఆకాశానికి ఒక్క గుంజ అయినా లేదే! విరిగిపడితే ఇంకేమైనా ఉందా!"

భీమన్న భయంతో లేచి కూర్చున్నాడు. ఆకాశం విరిగి మీద పడితే తన ప్రాణాలు పోతాయన్న భయం వాణ్ణి బాగా పట్టుకున్నది. ఎవరితోనన్నా చెప్పుకుందామన్నా అందరూ నిద్రపోతున్నారు. భీమన్న పరిగెత్తుకుంటూ పోయి ఊరిబయట ఉన్న ఊడలమర్రి కింద కూర్చున్నాడు. ఆకాశం పడితే చెట్టుకొమ్మలు అడ్డి, తన ప్రాణాలు కాపాడతాయని వాడి ఉద్దేశం.

ఆ రాత్రంతా వాడు ఆ చెట్టు కిందనే జాగారం చేశాడు.

తెల్లవారింది. భీమన్న ఊళ్ళోకి తిరిగి వచ్చి, కనిపించిన ప్రతివాడితోనూ, "చిన్న పందిరికే నాలుగు గుంజలుంటే, ఇంత పెద్ద ఆకాశానికి ఎన్ని గుంజలుండాలి? ఒక్కటీ లేదే! అది మీద పడితే మనమంతా చచ్చిపోమా? మనమంతా ఆకాశం లేని చోటికి పోదాం!" అన్నాడు.

"వీడి కేదో పిచ్చి పట్టింది!" అని అందరూ నవ్వుకున్నారు. కొందరు, "పోరా

పి. జ్ఞానప్రసూన

పిచ్చికుంకా!" అంటూ మందలించారు. అంతేకాని, భీమన్న మాటలను ఒక్కరూ లక్ష్యపెట్టలేదు.

"వీళ్ళే పిచ్చికుంకలు. బతికే యోగ్యత లేక వాళ్ళు నా మాట వినకుండా ఉన్నారు. ఒకరితో నా కెందుకు? నేను ఆకాశం లేని చోటుకు పోయి హాయిగా బతుకుతాను," అనుకుని భీమన్న ఆ వూరి నుంచి బయలుదేరాడు.

ఊరు దాటినాక అడవి వచ్చింది. అడవి దారిన ఒకరూ, ఇద్దరూ భీమన్నకు ఎదురయారు. ఉండబట్టలేక భీమన్న తన భయాన్ని ఒక మనిషికి చెప్పుకున్నాడు. ఆ మనిషి, "నీ కేమన్నా మతిపోయిందా ఏమిటి? ఆకాశానికి గుంజ లేమిటి?" అంటూ ముందుకు సాగిపోయాడు.

ఇంత చిన్న విషయాన్ని కూడా ఎవరూ అర్థం చేసుకోనందుకు చిరాకుపడుతూ భీమన్న ముందుకు సాగాడు. ఎంత దూరం నడిచినా అడవి తరగటం లేదు. ఎక్కడా ఊరు తగలలేదు. భీమన్న ఒక చోట ఆగి తల ఎత్తి చూస్తే, చెట్ల మీదుగా ఆకాశం కనిపించింది. ఆకాశం లేని చోటు చేరాలంటే ఇంకా నడవాలి లాగున్నది.

చీకటి పడే దాకా నడిచి భీమన్న, ఆ రాత్రి గడపటానికి పెద్ద చెట్టు కిందికి



వచ్చాడు. ఆకాశం పడినా చెట్టుకొమ్మలు తన ప్రాణాలను కాపాడతా యనుకుని.

ఆ చెట్టు కింద ఒక మనిషి కళ్ళు మూసు కుని కూర్చుని ఉండి. భీమన్న వచ్చిన అలికిడికి కళ్ళు తెరిచి, అతడి కేసి చూశాడు. ఆయన ఒక యోగి.

భీమన్న ఆయనను చూడగానే, "మీరు కూడా ఆకాశం పడుతుందనేనా, ఇంత దూరం వచ్చి ఈ చెట్టుకింద చేరారు? భలే!" అన్నాడు.

వాడు పిచ్చివాడని గ్రహించి యోగి చిరు నవ్వు నవ్వుతూ, "ఆకాశం పడట మేమిటి?" అని అడిగాడు.

"చిన్న పందిరికే నాలుగు గుంజ లుంటాయి గదా! ఇంత పెద్ద ఆకాశం గుంజలు లేకుండా ఎంతకాలం పడకుండా వుంటుంది?" అన్నాడు భీమన్న.

"అదా నీ అనుమానం? ఆకాశానికి గుంజలు లేకపోవట మేమిటి, నాయనా? ఉన్నాయి! వాటి సంగతి తెల్లవారినాక చెబుతాను. ఈ రాత్రికి పడుకుని నిద్రపో," అన్నాడు యోగి.

యోగి మాట నమ్మి భీమన్న ఆ రాత్రి నిశ్చింతగా నిద్రపోయాడు.

తెల్లవారింది. భీమన్న లేవగానే యోగి, "నాయనా, ఆకాశానికి గుంజలు లేవని



కాదూ, నీ అనుమానం? అది తీరే పద్ధతి నీకు చెబుతాను. ఇటుగా వెళ్ళావంటే ఒక గ్రామం వస్తుంది. ఆ గ్రామంలో ప్రతి ఇంటికీ వెళ్ళి, ఇంట్లో వాళ్ళను నోటికి వచ్చి నట్టు తిట్టి, బిచ్చం పెట్టించుకుని తిరిగి రా!" అన్నాడు.

భీమన్న ఆయన చెప్పిన మార్గాన వెళ్ళి, ఊరు చేరుకుని, ఒక్కొక్క ఇంటి ముందే ఆగి, ఇంటోవాళ్ళను తిడుతూ బిచ్చం పెట్ట మని అడగసాగాడు. అందరూ వాణ్ణి కొట్ట బోయినవాళ్ళే గాని, ఒక్కరూ బిచ్చం పెట్టలేదు. తనకు బిచ్చం దొరకదని వాడు నిరాశ చేసుకుంటూ మరొక ఇంటి ముందుకు వెళ్ళి, బిచ్చం వెయ్యమని అరిచాడు. లోపలి నుంచి జవాబు లేదు. భీమన్న తిట్లు ప్రారంభించాడు.

ఇంతలో ఒక స్త్రీ దోసిట్లో బియ్యం తీసు కుని పరిగెత్తుకుంటూ వచ్చి, "ఆలస్యం అయింది, నాయనా! ఆకలితో అలమటించే వాడివి తిట్టావంటే తిట్టవూ?" అంటూ, బియ్యం భీమన్న ఒడిలో పోసి, లోపలికి తిరిగి వెళ్ళింది. భీమన్న అమితంగా ఆశ్చర్యపడి పోయాడు.

వాడు అరణ్యంలోకి తిరిగి వెళ్ళి, యోగితో జరిగిన దంతా చెప్పాడు.

యోగి నవ్వి, "చూశావా? నువు తిట్టినా ఆ మహా ఇల్లాలు కోపం తెచ్చుకోకుండా నీకు బిచ్చం పెట్టింది. అటువంటివాళ్ళు నూటికీ, కోటికీ ఒకరున్నా చాలు. వాళ్ళే ఆకాశానికి గుంజలు. పందిరికి నాలుగే గుంజలు, కాని ఆకాశానికి ఇలాంటి గుంజలు ఎన్నో వున్నాయి. అందుకే ఆకాశం పడి పోదు," అన్నాడు.

భీమన్నకు ఆయన మాటలు అర్థ మయాయి. తన భయాన్ని తీర్చిన ఆ యోగికి సాష్టాంగపడి నమస్కారం చేసి, ఆయనకు శుశ్రూషలు చేస్తూ, భీమన్న ఆ అరణ్యంలోనే ఉండిపోయాడు.





# మోసగాళ్లు

ఒకప్పుడు ఇద్దరు మోసగాళ్లు ఉండేవాళ్ళు. ఒకడి పేరు వక్రబుద్ధి. రెండోవాడి పేరు దుర్బుద్ధి. జనాన్ని వాళ్లు రకరకాలుగా మోసపుచ్చి జీవిస్తూ ఉండేవాళ్ళు.

వాళ్లు దేశసంచారం చేస్తూ ఒకనాడు ఒక గ్రామం చేరారు. వాళ్ళకు పొలాల్లో ఒంటరిగా ఒక ఎద్దు కనిపించింది. వాళ్ళు దాన్ని తోలుకుపోయి మరొక చోట కట్టేసి, ఊళ్ళో ఉన్న సత్రానికి తిరిగి వచ్చారు. వక్రబుద్ధి సత్రంలోనే దిగబడిపోయాడు. దుర్బుద్ధి ఊళ్ళోకి వెళ్ళాడు.

ఈలోపల ఎద్దుగల ఆసామీ తన ఎద్దు పోయిందని తెలుసుకుని, ఆ మాట గ్రామస్తులందరికీ చెప్పసాగాడు. చిన్న గుంపు తయారయింది. ఫలాని వారి ఎద్దు పోయిందని అందరూ విడ్డూరంగా చెప్పుకుంటున్నారు.

దుర్బుద్ధి వారి వద్దకు వచ్చి, "ఏదో పోయిందనుకుంటున్నట్టున్నారే. సత్రంలో మా గురువుగారు గొప్ప జ్యోతిషాచార్యులు. వారిని చూసినట్టయితే పోయిన వస్తువు జాడ చెప్ప గలుగుతారు," అన్నాడు.

ఎద్దును పోగొట్టుకున్న ఆసామీకి ఈ మాట వినగానే ప్రాణం లేచి వచ్చినట్టయి, దుర్బుద్ధినీ, మిగిలిన గ్రామస్తులనూ వెంట బెట్టుకుని సత్రానికి వెళ్ళాడు.

వక్రబుద్ధి సంగతంతా విని తన పెట్టె నుంచి తాటాకు పుస్తకాలు తీసి, అక్కడక్కడా చదివి, కళ్ళు మూసుకుని కొంత సేపు ఆలోచించినట్టు నటించి, "ఈ సత్రానికి ఉత్తరంగా పోతే ఒక పెద్ద వటవృక్షం వస్తుంది. అక్కడి నుంచి తూర్పుగా పోతే ఒక ఎత్తయిన చింత చెట్టు వస్తుంది. అటు నుంచి ఎడమ పక్కకు చూస్తే ఒక చిన్న మామిడి చెట్టు కనిపిస్తుంది. ఆ ప్రాంతంలోనే నీ పోయిన ఎద్దు ఉన్నది," అని ఆసామీతో అన్నాడు.

బర్మా జానపద కథ



ఆసామీ వెంట దుర్బుద్ధీ, మిగిలినవాళ్లూ బయలుదేరి వెళ్ళారు. వక్రబుద్ధి చెప్పిన చోటనే ఎద్దు కనబడింది. గురువుగారి దక్షిణ అని దుర్బుద్ధి ఆసామి వద్ద పది రూపాయలు వసూలు చేశాడు.

మోసగాళ్ళకు బాగానే గిట్టుబాటు అయింది. వాళ్ళు ఆ గ్రామం విడిచి మరొక చోటికి ప్రయాణమవుతూండగా గ్రామాధికారి వారి కోసం పరిగెత్తుకుంటూ వచ్చి, "మీ కోసమే వచ్చాను. మీరు ప్రయాణం కట్టినట్టున్నారు. ఇంకా నయం! కాస్త ఆలస్యమైతే నా గతి ఏమయేది?" అంటూ తాను వచ్చిన పని చెప్పాడు.

అయన ఇంట వుండే బంగారు పాన్‌దాన్ పోయింది. ఎవరో దాన్ని దొంగిలించారు. అది చాలా ఖరీదైనది. దాన్ని జ్యోతిషాచార్యులుగారు గ్రామాధికారికి తిరిగి ఇప్పించాలి.

వక్రబుద్ధి క్షణంపాటు దిమ్మెరపోయాడు. కాని మోసంలో సిద్ధహస్తుడు కావటంచేత, "ఇది వర్జ్య సమయం. ఇప్పుడేమీ చూడటానికి లేదు. రేపు ఉదయం వచ్చినట్టయితే ఆ దొంగతనం విషయం ఆచూకీ తీస్తాం!" అన్నాడు.

"చిత్తం, అలా అయితే రేపు సూర్యోదయంవేళ మళ్ళీ తమ దర్శనం చేసుకుంటాను," అని గ్రామాధికారి వెళ్ళిపోయాడు.

తరవాత తోడు దొంగ లిద్దరూ కూడబలుక్కున్నారు.

"మనం వెంటనే ఉడాయించటం మంచిది," అన్నాడు దుర్బుద్ధి.

"రాత్రి మాటుమణిగాక బయలుదేరుదాం. ఇప్పుడైతే అందరూ చూస్తారు," అన్నాడు వక్రబుద్ధి.

ఈలోపల గ్రామాధికారి ఇంటికి తిరిగి వెళ్ళి, దొంగను జ్యోతిషాచార్యులు పట్టుకుంటానని మాట ఇచ్చాడనీ, అయనకు

సాధ్యం కానిదంటూ లేదనీ, తన పాన్‌దాన్ తిరిగి దొరికినట్టేననీ అందరికీ చెప్పేశాడు.

ఆయన పరివారంలో ప్రారబ్ధం అనేవా డొకడున్నాడు. బంగారు పాన్‌దాన్ దొంగిలించినది వాడే. జ్యోతిషాచార్యుల సంగతి వినగానే వాడి గుండెల్లో రాయి పడింది. ఆ రాత్రి వాడు సత్రం కేసి వెళ్ళి, మోస గాళ్ళుంటున్న గది కిటికీ కింద చేరి, లోపల జరిగే సంభాషణ ఆలకించసాగాడు.

"అప్పుడే మనం పోయి ఉండవలిసింది. ఇదేమిటి? చీకట్లోపడి దొంగవెధవల్లాగ — నాకేమీ బాగా లేదు," అంటున్నాడు వక్రబుద్ధి.

ప్రారబ్ధంగాడు తనను గురించే వాళ్లు మాట్టాడుకుంటున్నా రనుకున్నాడు. వాడి భయం రెట్టింపయింది.

"నన్నేమీ అనకు. ఈ దొంగతనం వచ్చి పడుతుందనుకున్నామా? ప్రారబ్ధం! అహా, ప్రారబ్ధమే!" అన్నాడు దుర్బుద్ధి.

ఈ మాట వినేసరికి ప్రారబ్ధంగాడికి గుండె అవిసి పోయింది. వాడు లోపలికి వచ్చి, మోసగాళ్ళ కాళ్ళు పట్టుకుని, "బాబూ, రక్షించండి. పాన్‌దాన్ దొంగిలించి నందుకు నా తోలు వొలిచేస్తారు. అది ఎక్కడ దాచానో తమకు చెప్పేస్తాను. నా ప్రాణం కాపాడండి!" అన్నాడు.





"సరే, ఆ దాచిన చోటు చెప్పు!" అన్నాడు వక్రబుద్ధి.

ప్రారబ్ధంగాడు పాన్‌దాన్ దాచిన చోటు చెప్పి, చల్లగా తిరిగి వెళ్ళిపోయాడు.

గ్రామాధికారి మర్నాడు సూర్యోదయం వేళకు వచ్చాడు.

"వల్లకాడులో ఉండే సావడి మెట్ల దిగువన పాన్‌దాన్ పాతిపెట్టి ఉన్నది. వెంటనే వెళ్ళి తెచ్చుకోండి," అన్నాడు వక్రబుద్ధి గ్రామాధికారితో.

గ్రామాధికారి వెళ్ళి వల్లకాడులోని సావడి మెట్ల కింద తవ్వి చూస్తే పాన్‌దాన్ దొరికింది. ఆయన పరమానందభరితుడై జ్యోతిషాచార్యులకు వంద రూపాయలు కానుక ఇవ్వటమే గాక, ఆయననూ, ఆయన శిష్యుణ్ణీ తన ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. మోసగాళ్ళు విందు కుడుస్తూండగా రాజుగారి మనిషి వచ్చి గ్రామాధికారికి ఒక వార్త చెప్పాడు. అదేమిటంటే—

మూడు రోజుల క్రితం రాజధాని తీరపు రేవుకు ఏడు వర్తకపు ఓడలు వచ్చాయి. వాటి నిండా ఎంతో విలువైన వర్తకపు సరుకున్నది. ఓడలు గల వర్తకుడు రాజుగారితో ఒక పందెం వేశాడు. తానొక ఇనప పెట్టె ఇస్తాననీ, అందులో ఏమున్నదీ వారం లోపల రాజుగారు చెబితే తన ఓడలన్నీ రాజుగారికి ఇస్తాననీ, రాజుగారు చెప్పలేకపోతే రాజ్యం తన కివ్వవలసి వుంటుందనీ ఆయన అన్నాడు.

రాజుగారి దగ్గిర కొందరు దైవజ్ఞులున్నారు. వారి మీద రాజుగారికి అమితమైన విశ్వాసం. అదీగాక, ఆ ఏడు ఓడల సరుకూ కాజెయ్యాలని రాజుగారికి దుర్బుద్ధి కలిగింది. అందుచేత ఆయన వర్తకుడి పందెం ఆమోదించాడు. అయితే రాజుగారి దైవజ్ఞులు గుడ్లు వెళ్ళబెట్టేసి, ఆ ఇనప పెట్టెలో ఏమున్నదో చెప్పే శక్తి తమకు లేదన్నారు. మూడు రోజులు అయిపోయాయి.



ఇంక నాలుగు రోజులలో పందెం గెలవక పోతే రాజుగారు రాజ్యభ్రష్టుడవుతాడు. ఆయనకు కంపరం పుట్టి తన రాజ్యంలో ఉన్న గ్రామాధికారులందరికీ కబురు చేశాడు—ఎక్కడ జ్యోతిష్కులున్నా వెంటనే పంపమని!

గ్రామాధికారి వక్రబుద్ధితో, "మీ వంటి జ్యోతిషాచార్యులు ఉండగా మా రాజుగారి కేమీ భయం లేదు. మీరూ, మీ శిష్యుడూ నా వెంట రండి," అన్నాడు.

విధిలేక మోసగాళ్ళు రాజుగారి వద్దకు వెళ్ళారు. అక్కడ వారికి రాజోపచారం జరిగింది. తరవాత ఏమైనా, ప్రస్తుతానికి వాళ్ళు చాలా సుఖపడ్డారు.

గడువు ఆఖరు రోజు వచ్చింది. మర్నాడు ఉదయం ఇనపపెట్టెలో ఏమున్నదీ రాజు చెప్పకపోతే రాజ్యం పోతుంది; మోసగాళ్లు రాజుకు చెప్పలేకపోతే వాళ్ళ తలలు పోతాయి!

"ఈ రాత్రికి పారిపోదాం," అన్నాడు దుర్బుద్ధి.

"ఎక్కడికని పారిపోదాం? రాజు మనల్ని తప్పక పట్టుకుంటాడు. చాలా అవమానకరమైన చావు చావాలి. అంతకన్న సముద్రంలో పడి ఈదుకుంటూ పోతే, గుట్టు చప్పుడు కాకుండా చావవచ్చు. ఆ విధంగా కొంత కీర్తి అయినా మిగులుతుంది," అన్నాడు వక్రబుద్ధి.

ఝాముపొద్దు పోయాక, ఇద్దరూ సముద్ర తీరానికి వెళ్ళి, సముద్రంలో దిగి ఈదుతూ పోసాగారు. కొద్ది దూరంలో వారికి ఏవో ఓడలు తగిలాయి. ఒక ఓడలో నుంచి ఏవో మాటలు వినిపించాయి.

"చెప్పు, తాతా! ఆ పెట్టెలో ఏముంది?" అంటున్నది ఒక చిన్నపిల్ల.

"అదంతా నీ కెందుకు, తల్లీ? పొద్దు పోయింది. వెళ్లి పడుకో," అంటున్నాడు ఆ పిల్ల తాత.

"పెట్టెలో ఏముందో చెబితే పడుకుంటా! లేకపోతే పడుకోను," అని పిల్ల మొండి కెత్తింది.

"తెల్లారగానే బయటపడేదేననుకో. ఆ పెట్టెలో ఏముందో తెలుసా? ఇనప పెట్టెలో ఒక ఇత్తడి పెట్టె ఉన్నది. ఇత్తడి పెట్టెలో ఒక వెండి పెట్టె ఉన్నది. వెండి పెట్టెలో ఒక బంగారు పెట్టె ఉన్నది. ఆ బంగారు పెట్టెలో అత్తరు సీసా ఉన్నది! చెప్పానుగా, ఇక వెళ్లి పడుకో!" అన్నాడు పిల్ల తాత. అతను వర్తకుడి పెద్దసరంగు.

ఈ విషయం తెలియగానే మోసగాళ్లు నిశ్శబ్దంగా ఈదుకుంటూ వెనక్కు తిరిగి వెళ్ళి, తెల్లవారుతూనే రాజుగారికి ఇనప పెట్టె రహస్యం చెప్పేశారు.

వర్తకుడు తన ఓడలన్నిటినీ రాజుగారికి అర్పించుకున్నాడు.

రాజుగారు వక్రబుద్ధిని తన ఆస్థాన జ్యోతిష్కులకు పెద్దగా నియమించాడు. ఇది మోసగాళ్ళకు ఇష్టం లేదు. ఎందుకంటే ఎప్పటికైనా తమ మోసం బయటపడి తీరుతుంది. అందుచేత వాళ్ళు మరొక కుతంత్రం పన్నారు.

ఆ సాయంకాలం వక్రబుద్ధి రాజభవనానికి వెళ్ళి రాజుగారితో కబుర్లాడుతూ ఉండగా దుర్బుద్ధి ఏడుస్తూ వచ్చి, "గురూజీ, కొంప మునిగింది. మన బస కాలిపోయింది. జ్యోతిషగ్రంథాలన్నీ అగ్నికి ఆహుతి అయాయి!" అంటూ బొబ్బ లెక్కిన తన చేతులు చూపాడు.

"అయ్యో, ఇంకేమున్నది? నా బతుకు తెరువేపోయింది!" అంటూ వక్రబుద్ధి దిక్కు మొహం పెట్టాడు.

"విచారించకండి. మీ కిద్దరికీ ఉన్నతమైన ఉద్యోగాలిస్తాను," అన్నాడు రాజు.

మోసగాళ్ళ ఆఖరు ఎత్తు కూడా పారింది. వాళ్ళు రాజుగారి దివాణంలో సుఖంగా బతికారు.





# మాయదారి ముసలిది

## 2

ఈ లోగా దిలైలా తాను ధరించిన సూఫీ భిక్షుకురాలి వేషం తీసేసి, ఒక భాగ్యవంతుల పరిచారిక లాగా దుస్తులు వేసుకుని, తన చాకచక్యంతో బాగ్దాదునగరాన్ని అట్టుడికించడానికి మళ్ళీ ఇంటినుంచి బయలుదేరింది.

ఆమె ఒక సందులోకి తిరిగేసరికి ఒక ఇంట చాలా కోలాహలంగా ఉన్నది. లోపల మేళతాళాలూ, పాటలూ సాగుతున్నాయి. దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. వీధివాకిట ఒక మనిషి ఒక చిన్న కుర్రవాణ్ణి ఎత్తుకుని నిలబడి ఉన్నది. వాడి వంటినిండా వెండి, బంగారు జరీగల దుస్తులూ, రత్నాలు పొదిగిన ఆభరణాలూ, ముత్యాల చేర్లూ ఉన్నాయి.

ఆ ఇల్లు బాగ్దాదు వర్తకుల పెద్దది. లోపల ఆయన కుమార్తెకు ప్రధానం చేస్తున్నారు. వర్తకుడి భార్య పేరంటాళ్ళకు ఆతిథ్యం ఇవ్వాలంటే వీలు కాకుండా ఆమె చిన్నకొడుకు మారాం చెయ్యసాగాడు. అందుచేత ఆమె తన కొడుకును బానిసదానికిచ్చి, అతిథులు వెళ్ళిపోయిన దాకా ఆడిస్తూ ఉండమన్నది. ఈ విషయాలన్నీ దిలైలా వీధిలోనే ఆరాతీసి, ఆ కుర్రవాడి వంటిమీది నగలు కాజేయాలని సంకల్పించింది.

ఆమె వీధి జనాన్ని తోసుకుంటూ బానిసను సమీపించి, "నా ఇల్లు బంగారం కానూ, ఆలస్యం కానే అయింది!" అని గట్టిగా అని, ఒక చెల్లని నాణెం తీసి బానిసదాని చేతిలో పెట్టి, "మీ పాత దాది ఉమాల్ ఖయర్ సలాములు చెప్ప వచ్చిందని అమ్మగారికి చెప్పిరా, తల్లీ!" అన్నది.

బానిస నాణెం తీసుకుంటూ, "అమ్మగారు కనిపిస్తే అబ్బాయిగారు కొంగు పట్టు

ఆర్. నాగభూషణం




కుని వదలక మారాం చేస్తారు. నే నెలా వెళ్ళేదమ్మా?" అన్నది.

"చిట్టితండ్రిని నేను పట్టుకుంటాలే!" అన్నది దిలైలా.

బానిస ఈ మాటలు నమ్మి పిల్లవాణ్ణి దిలైలా కిచ్చి, లోపలికి వెళ్ళిపోయింది.

వెంటనే దిలైలా ఆ పిల్లవాడితో సహా నిర్జనంగా ఉన్న ఒక గొందిలోకి వెళ్ళి, వాడి వంటి మీద ఉన్న నగలూ, బట్టలూ ఊడ్చేసి, వాణ్ణి తీసుకుని ఒక పెద్ద రత్న వర్తకుడి దుకాణానికి వెళ్ళింది.

ఆ వర్తకుడు వర్తకులపెద్ద యొక్క కొడుకును గుర్తించి, మంచి బేరం తగిలిందనుకుని, "మీ యజమానికి ఏం కావాలి?" అని దిలైలాను అడిగాడు.

"ఈ పిల్లవాడి అక్కకు ప్రధానం చేస్తున్నారు. ఒక జత బంగారు గాజులూ, రెండు జతల బంగారు పాంజేబులూ, వరహాల చెవి కమ్మలూ, నగిషీవడ్డాణమూ కావాలి. అంతా కలిసి వెయ్యిదీనారాలకు తక్కువ కాకుండా ఇప్పించండి. సరుకు తీసుకుపోయి అమ్మగారికి చూపించి, నచ్చితే డబ్బు తీసుకుని ఇప్పుడే వస్తాను. అంతదాకా అబ్బాయిని ఇక్కడే ఉంచిపోతాను," అన్నది దిలైలా.

"అబ్బాయిని ఉంచనవసరం లేదు. ఉంచాలని ఉంటే ఉంచు," అని వర్తకుడు ఆమె కోరినవన్నీ ఇచ్చాడు. వాటిని తీసుకుని దిలైలా తిన్నగా తన ఇంటికి వెళ్ళిపోయింది.

అక్కడ వర్తకులపెద్ద ఇంటికి చేరేసరికి ఇల్లు భీభత్సంగా ఉన్నది. ఆయన భార్య కిందపడి దొర్లుతూ పుట్టెడు దుఃఖంలో ఉన్నది. పిల్లవాడు కనబడటం లేదు. వర్తకుడు ఎంతో ప్రయాసపడి వెతికించగా వాడు నగల వర్తకుడి దుకాణంలో దొరికాడు.

"దొంగ వెధవా, నా పిల్లవాణ్ణి ఇక్కడ పెట్టావా? వాడి వంటి మీద నగలూ, దుస్తులూ ఎక్కడ?" అని అడిగాడు వర్తకుల పెద్ద.

"నేను తమ ఇంటికి పంపిన వెయ్యి దీనారాల నగల మాటేమిటి?" అన్నాడు నగలవర్తకుడు.

ఒకరి గొడవ ఒకరికి అర్థం కావటానికి చాలాసేపు పట్టింది. వాళ్లు ఘర్షణ పడు తుండగా, దిలైలా చేత మోసపోయిన ముగ్గురూ అక్కడికి వచ్చారు. ఒకరి సంగతి ఒకరు విన్నాక, అందరినీ మోసగించినది ఒకతేనని తెలిపోయింది.

"ఆ ముండ అంతు తేల్చకుండా నేను నిద్రపోను," అన్నాడు వర్తకుల పెద్ద.

"ఆ ముసలిదాన్ని పట్టటానికి నేను కూడా మీతో వస్తాను," అన్నాడు నగల వర్తకుడు.

కాని ఎలా వెతకాలి? అందరూ కలిసి కట్టగా వెళ్ళి లాభం లేదు. అందరూ తలా ఒక దిక్కు వెళ్ళిపోయి, మధ్యాహ్నాని కల్లా హాజ్‌మసూద్ అనే మంగలి పెట్టిన దుకాణం దగ్గిర కలుసుకునేటట్టు ఏర్పాటు చేసుకున్నారు.

మధ్యాహ్నంవేళకు గాడిద గల కుర్ర వాడు మంగలి దుకాణం కేసి వస్తూండగా వాడికి దిలైలా కనిపించింది. వేషం మారినా వాడు ఆమెను గుర్తుపట్టి, "దొరికావా, దొంగ పీనుగా!" అన్నాడు.



"అదేమిటి, నాయనా?" అన్నది దిలైలా అమాయికంగా.

"నా గాడిద! నా గాడిదను నా కిచ్చి మరీ మాట్టాడు," అన్నాడు కుర్రవాడు.

"ఎందుకలా అరుస్తావు? నీ గాడిదను నేను కాజేశా ననుకుంటున్నావా? మంగలి మసూదు దగ్గిర ఉంచాను. మాట్టాడకుండా, నా వెంటరా, నీ గాడిదను నీకు ఇప్పిస్తా," అన్నది దిలైలా.

ఇద్దరూ మంగలి దుకాణం చేరారు. కుర్రవాణ్ణి బయటే ఉండమని, దిలైలా లోపలికి వెళ్ళి మసూదుతో, "నువే కాపాడాలి, నా తండ్రీ!" అన్నది.



"ఏమిటి, పిన్నమ్మా? అసలు సంగతి చెప్పు," అన్నాడు హజ్‌మసూద్.

"ఆ బయట ఉన్నాడే, వాడు నా కొడుకు, నాయనా. ఖాయిలా పడి, చచ్చి బతికాడు. కాని వాడి బుద్ధి పుచ్చిపోయింది. చిన్నప్పుడు వాడికొక గాడిద ఉండేది. దానికోసం వాడిప్పుడు ఒకటే కలవరింత! గాడిదో, గాడిదో అంటాడు. వాడి పిచ్చి నువే వదల గొట్టాలి," అన్నది దిలైలా.

మంగలి దిలైలా నుంచి దీనారం తీసుకుంటూ, "అదెంత పని? తల గొరిగేసి నిమ్మ రసం అంటానంటే, మూడు పూటల్లో గుణం ఇస్తుంది," అన్నాడు.

"మంచి మాటలతో వాణ్ణి పిలిచి, వైద్యం చెయ్యి, నాయనా. నీ రుణం ఉంచుకోనులే," అన్నది దిలైలా.

మసూద్ దుకాణం బయటికి వచ్చి, కుర్రవాణ్ణి చూసి, "లోపలికి రా," అన్నాడు.

"నా గాడిద?" అన్నాడు కుర్రవాడు.

"నీ గాడిద ఎక్కడికి పోతుంది. అది నా దగ్గిర ఉన్నది లే! ఒక క్షణం లోపలికి రా!" అన్నాడు మంగలి.

కుర్రాడు పసారాలోకి అడుగు పెట్టగానే మసూద్ నౌకర్లు వాణ్ణి పట్టుకుని, పెడ రెక్కలు విరిచి కట్టారు. మసూద్ వాడి తల నున్నగా గొరిగి, నిమ్మ రసం మర్దన చేశాడు. కుర్రవాడు పెద్ద పెట్టున కేకలు పెట్టాడు.

మసూద్ చికిత్స ముగించి లోపలికి వెళ్ళేసరికి ముసలిది లేదు సరేకదా, దుకాణానికి సంబంధిన కత్తులూ, కత్తెరలూ, అద్దాలూ, తల నూనెలూ, మర్దన తైలాలూ, అత్తరులూ, కుర్చీలూ, బల్లలూ మాయమయాయి.

మసూద్ కుర్రవాడి దగ్గిరికి వచ్చి, వాడి పీక పట్టుకుని, "మీ అమ్మ ఎక్కడరా, పిశాచంగాడా?" అని అడిగాడు.

"మా అమ్మ పోయి ఎంత కాలమాయె! నా గాడిదను ఇస్తానన్నావు, ఇచ్చెయ్యి," అన్నాడు కుర్రవాడు, తల నిమురుకుంటూ.

ఈ సమయంలో మిగిలిన వాళ్ళుకూడా అనుకున్న ప్రకారం దుకాణం చేరుకున్నారు. జరిగినదంతా విన్నాక, ముసలిది మంగలి మసూద్‌ను కూడా మోసగించినట్టు స్పష్టమయింది. ముసలిదాన్ని పట్టుకునేటందుకు బయలుదేరిన జట్టులో మసూద్ కూడా చేరాడు.

వాళ్ళు వీధుల వెంబడి తిరుగుతూండగా, గాడిదగల కుర్రవాడికి దిలైలా మళ్ళీ కనిపించింది. వాడు చప్పున ఆమెమీద పడి పట్టుకుని, "ముసలిముండ దొరికింది! ఈ సారి తప్పించుకు పోనివ్వకండి," అని బిగ్గరగా అరిచాడు.

అందరూ కలిసి దిలైలాను పట్టుకుని ఖాలిద్ ఇంటికి తీసుకుపోయి, అక్కడి భటులతో, "మేము వెంటనే ఖాలిద్‌గారి దర్శనం చెయ్యాలి," అని చెప్పారు.

ఖాలిద్ నిద్రపోతున్నాడనీ, ఆయన లేచే దాకా వాళ్ళు వేచి ఉండవలిసి ఉంటుందనీ భటులు చెప్పారు. వాళ్ళు మగవారిని ఆవరణలో కూర్చోమని, దిలైలాను జనానాలోని ఒక గదిలోకి పంపించారు.

దిలైలా ఆ గదిలో ఉండిపోక, ఇంకా లోపలికి వెళ్ళి, అనేక గదులు దాటి, మేడమీద ఖాలిద్ భార్య ఉండే గదికి వెళ్ళింది. ఆమె ఖాలిద్ భార్యకు సలాం చేసి,





"మా బానిసలను మీ భర్తగారు పన్నెండు వందల దీనారాలకు బేరం చేశారు. వాళ్ళను అప్పగించటానికి తెచ్చాను. ఆయన నిద్ర పోతున్నట్టు తెలిసింది. వారు లేచేసరికి ఏవేళ అవుతుందో?" అన్నది.

"ఆ సంగతి నాకు తెలియదుగాని, బానిసలను కొనాలని మాత్రం వారు నాతో ఎప్పుడో అన్నారు. ఇంతకూ మీ బానిస లెక్కడ?" అని అడిగింది ఖాలిద్ భార్య.

"బయట ఉన్నారు. కిటికీలో నుంచి చూస్తే కనిపిస్తారు. అందరూ మంచి పుటక గలవాళ్ళేలెండి. అందుకు సందేహం అక్కర్లేదు," అన్నది దిలైలా.

ఖాలిద్ భార్య కిటికిలో నుంచి చూసింది. బయట నిలబడిన వాళ్ళు ఆమెకు తృప్తి కరంగానే ఉన్నారు. ఆమె దిలైలాతో, "డబ్బు నేనే ఇద్దును, కాని నా దగ్గర ప్రస్తుతం వెయ్యిదీనారాలే ఉన్నాయి. ఏం చేసేది?" అన్నది.

"వెయ్యి చాలుగదండీ? రెండువందలు ముందే బయానాగా తీసుకున్నానుగా?" అన్నది దిలైలా.

ఆమె ఖాలిద్ భార్య నుంచి వెయ్యి దీనారాలూ తీసుకుని సలాం చేసి, "కూర్చో బెట్టకుండా నా పని పూర్తిచేసి చాలా పుణ్యం కట్టుకున్నారు. నాకు మా బానిసల ముఖాలు చూడటానికి చాలా బాధగా ఉంది. మీరు మరోలా అనుకోక, నన్ను దయచేసి దొడ్డి దారిన పంపెయ్యండి," అన్నది.

ఖాలిద్ భార్య దిలైలాను దొడ్డిదారిన పంపేసింది.

ఖాలిద్ నిద్రలేవగానే ఆమె ఆయనతో, "మొత్తానికి మంచి బేరమే చేశారే!" అంటూ బానిసల సంగతి అంతా చెప్పి అభినందించింది.

ఖాలిద్ అంతా విని ఆశ్చర్యపోయి, "బానిస లేమిటి? బేర మేమిటి? నే నెవ రికీ బయానా ఇవ్వలేదే!" అన్నాడు.

"అదేమిటి? నే నా ముసలావిడకు వెయ్యిదీనారాలూ ఇచ్చేశాను. ఆమె మనకు అమ్మిన బానిసలు కింద వున్నారు," అన్నది ఖాలిద్ భార్య.

ఖాలిద్ కిందికి వెళ్ళి, దుకాణదారునూ, కలంకారీవాణ్ణీ, రత్నాల వర్తకుణ్ణీ, మంగలి మసూద్‌నూ, గాడిదగల కుర్రవాణ్ణీ చూసి ఆశ్చర్యపడి, "మీరేనా నేను కొన్న బానిసలు?" అని అడిగాడు.

"ఇదేనా మీరు మాకు చేసే న్యాయం? మేము బానిసలమా? ఖలీఫాగారి నడుగుదాం పదండి," అన్నారు వాళ్ళు.

అదే సమయానికి ముస్తఫా కూడా అక్కడికి వచ్చాడు ఈ సరికి, ఆయనకు ముసలిది తన భార్యకు చేసిన మోసం గురించి తెలిసింది. ఆయన ఖాలిద్‌తో, "మీ నిర్వాహం కింద ప్రతి ముసలితొత్తూ యథేచ్ఛగా ఏ కొంపలోనైనా జొరబడి అమాయక స్త్రీలను మోసగించవచ్చులా కనబడుతుందే! నా భార్యకు జరిగిన మోసానికి ఏమి సంజాయిషీ ఇస్తారు?" అని అడిగాడు.

ఖాలిద్ బెదిరిపోయి, "అయ్యో, ఈ ముసలిదాన్ని శిక్షించే భారం నేను మీద వేసుకుంటాను. మీ అందరికీ దానివల్ల కలిగిన నష్టానికి పరిహారం ఇచ్చుకునే పూచీ కూడా నాదే!" అని, మిగిలినవాళ్ళ కేసి తిరిగి, "మీలో ముసలిదాన్ని గుర్తించగలవారెవరు?" అని అడిగాడు.

"మా వెంట పదిమంది భటులను ఇచ్చారంటే దాన్ని పట్టి తెస్తాం!" అన్నారు వాళ్ళు ఖాలిద్‌తో.

వారు భటులను వెంటబెటుకుని కొద్ది దూరం వెళ్ళేసరికే దిలైలా వారికి ఎదురుపడి, వారిని చూసి పారిపోబోయింది. కాని వారు వెంట తరిమి ఆమెను పట్టుకుని, చేతులు వెనక్కు విరిచి కట్టి ఖాలిద్ వద్దకు తీసుకుపోయారు. దిలైలా ఆట కట్టినట్టే కనబడింది.

—(ఇంకా వుంది)



# పెళ్ళిపరీక్ష

ఒక రాజుగారి కూతురు తన పెళ్ళికి ఒక నియమం పెట్టింది: ఆమెను పెళ్ళాడేవాడు ఆమె వేసే ప్రశ్నలకు జవాబు చెప్పి, తన ప్రశ్నలతో ఆమెను ఓడించాలి. రాజకుమార్తె అంద మైనది కావటంచేత ఆమెను పెళ్ళాడదామని నలుగురైదుగురు రాజకుమారులు వచ్చి, ఆమె ప్రశ్నలకు జవాబు చెప్పలేక ఓడిపోయారు.

చివరకు మహేంద్రు డనే రాజకుమారుడు వచ్చాడు. ఆమె అడిగిన ప్రశ్నలూ, వాటికి మహేంద్రుడి సమాధానాలూ ఇలా ఉన్నాయి:

"ప్రాణులన్నిటికి స్నేహితు డెవరు?" "సూర్యుడు."

"తన బిడ్డలను రక్షిస్తూనే భక్షించే తల్లి ఎవరు?" "భూమాత."

"సగం నలుపూ, సగం తెలుపూ అయిన ఆకులు గల చెట్టు ఏది?"

"సంవత్సరం. దాని ఆకులు రోజులు."

ఇక ప్రశ్న లడగటం మహేంద్రుడి వంతు. "పురుషులకు గర్వకారణమైన దేమిటి?" అని అత నడిగాడు. రాజకుమార్తె లోపలికి వెళ్ళివచ్చి, "కొడుకుల చేత ఓడటం." అన్నది.

"స్త్రీకి గర్వకారణం ఏమిటి?" అని అతను మళ్ళీ అడిగాడు.

రాజకుమార్తె వెనుకటి లాగే లోపలికి వెళ్ళివచ్చి, "భర్తతో ఓడిపోవటం," అన్నది.

"ఎవరి నడిగి సమాధానాలు చెప్పించుకుంటున్నావు?" అని మహేంద్రు డడిగాడు. సమాధానాలు తన అమ్మమ్మ చెప్పిందని ఆమె అన్నది. "నాకు ఓడిపోయిన నిన్ను నేను చేసుకుంటానో లేదో ఆమె నడిగి చెప్పు," అన్నాడు మహేంద్రుడు.

అమ్మమ్మే బయటికి వచ్చి, "చేసుకుంటావు, నాయనా. తాను జయించిన స్త్రీని ఏ మగవాడైనా చేసుకుంటాడు," అన్నది.





# ఉక్కుకోట

ఒక రాజుకు ఒక్కడే కొడుకు. యుక్త వయసు వచ్చినా అతను వివాహం గురించి తలపెట్టక పోవటం చూసి రాజు, ''నాయనా, నీకు పెళ్ళాడే వయసు వచ్చింది గదా, పెళ్ళి గురించి ఆలోచించవేం?'' అని అడిగాడు.

''పెళ్ళాడదగిన కన్య ఎవరూ నా దృష్టికి రాలేదు," అన్నాడు రాజకుమారుడు.

"అలా అయితే నేను సహాయం చేస్తాను. ఈ తాళపుచెవి తీసుకుని రాజభవనం పై భాగాన ఉన్న గది ప్రవేశించి చూడు. నీకు భార్య కాదగిన కన్య నీకు దొరక వచ్చు." అన్నాడు.

రాజకుమారుడు పైకి వెళ్ళి, ఎవరూ ఎన్నడూ తెరవని గది తలుపు తెరిచి లోపల అడుగు పెట్టాడు. అది ఒక గుండ్రని గది. ఆ గది గోడకు అనేక రాజకన్యల పటాలు వేళ్ళాడగట్టి ఉన్నాయి. ఆ పటాలను ఒక్కొక్కటిగా చూస్తూ రాజకుమారుడు గది ప్రదక్షిణం చేశాడు. అందులోని కన్య లందరూ ఒకరిని మించి ఒకరు అందంగా ఉన్నారు. అందరినీ మరొకసారి చూసి ఏదో ఒక నిర్ణయానికి వద్దామనుకుంటూండగా రాజకుమారుడికి ఒక పటం మీద గుడ్డ కప్పి ఉండటం కానవచ్చింది. అతను ఆ గుడ్డ తొలగించి, పటంలోని సుందరిని చూసి అలాగే నిలబడిపోయాడు. అందులో ఉన్న కన్య అపురూప సౌందర్యవతి. ఆమెనే పెళ్ళాడాలని రాజకుమారుడు నిశ్చయించు కున్నాడు.

అతను కిందికి దిగి వచ్చి తండ్రితో తన నిర్ణయం చెప్పేసరికి రాజు చిరాకుపడి, "గుడ్డ కప్పిన పటాన్ని ఎందుకు చూశావు? అది చూడదగినదైతే గుడ్డ కప్పి ఉంటుందా? ఆమె ఒక రాజకుమార్తె. దుర్మార్గుడైన మాంత్రికుడు ఒకడు ఆమెను అపహరించి

జి. జనార్దనరావు



తీసుకుపోయి, ఉక్కు కోటలో ఖైదు చేశాడు. ఆమెను చెర విడిపించాలని ఎందరో వెళ్ళారు; ఒక్కడూ తిరిగి రాలేదు. పట్టుదలగా ఉంటే నువు కూడా బయలుదేరి వెళ్ళు." అన్నాడు.

మర్నాడే రాజకుమారుడు తన గుర్రం మీద ఒంటరిగా బయలుదేరాడు. త్వరలోనే అతనొక కీకారణ్యంలోకి ప్రవేశించాడు. ఎంత దూరం వెళ్ళినా అది తరుగుతున్న లక్షణాలు కనబడలేదు.

ఇంతలో అతని కొక చాలా పొడుగుపాటి మనిషి కనిపించి, "నన్ను ఉద్యోగంలో పెట్టుకో," అని రాజకుమారుణ్ణి అడిగాడు.

తనకు ఒకడు తోడుండటం మంచిదే అనిపించి, "నువు ఏం చెయ్యగలవు?" అని రాజకుమారుడు అడిగాడు.

"నా పేరు 'పొడుగు'. నేను ఎంత ఎత్తయినా పెరగగలను. చూడు!" అంటూ ఆ పొడుగు మనిషి, చూస్తూండగానే, సమీపంలో ఉన్న చెట్టు ఎత్తు పెరిగి, ఆ చెట్టు పై కొమ్మలలో ఉన్న పక్షిగూడును గుడ్లతో సహా అందుకుని, తిరిగి మామూలు ప్రమాణానికి వచ్చి, రాజకుమారుడికి చూపాడు.

"బాగుంది! ఈ అరణ్యంలో నుంచి బయటపడే మార్గం చూపిస్తే నువు మరింత ప్రయోజకుడివి." అన్నాడు రాజకుమారుడు.

'పొడుగు' చెట్లన్నిటినీ మించి పెరిగి, చుట్టూ కలయ చూసి, "మనం ఈ దిక్కుగా పోతే త్వరలో అరణ్యం దాటగలం," అన్నాడు. వాడు చెప్పిన దిక్కుగా నడిచి ఇద్దరూ ఒక మైదానాన్ని చేరారు. దూరాన వారి కొక మనిషి కనిపించాడు.

"ఆ కనిపించేవాడు నాకు తెలుసు. అక్కరకు రాగలవాడు. అతన్ని కూడా నువు ఉద్యోగంలో ఉంచుకుంటే బాగుంటుంది," అన్నాడు 'పొడుగు'.

"అయితే, వాణ్ణి పిలు!" అన్నాడు రాజకుమారుడు.



"అంతకన్న వాణ్ణి తీసుకు రావటం తేలిక," అంటూ 'పొడుగు' పెరిగి, రెండు అంగల్లో ఆ మనిషిని చేరుకుని, క్షణంలో వాణ్ణి తీసుకువచ్చి రాజకుమారుడి ముందుంచాడు.

పొట్టిగా ఉన్న ఆ మనిషిని రాజకుమారుడు, "నువ్వెవరు? ఏం చెయ్యగలవు?" అని అడిగాడు.

"నా పేరు 'అడ్డం'. అడ్డంగా ఎంత లావైనా కాగలను," అన్నాడు పొట్టివాడు. ఈ మాట అంటూనే ఆ మనిషి ఊపిరి పీల్చి అతి వేగంగా లావు పెరగసాగాడు. రాజకుమారుడూ, 'పొడుగూ' దూరంగా పారి పోకపోతే వాడి కింద పడి రూపు మాసి పోయేవారే.

"ఈ విద్య గలవాడు ప్రపంచంలో మరొకడుంటాడనుకోను. నువు కూడా మా వెంటరా!" అన్నాడు రాజకుమారుడు, 'అడ్డం' ఊపిరి విడిచి మామూలు మనిషి అయిపోయాక.

ముగ్గురూ మైదానం దాటి కొండలను చేర వస్తూండగా వారికి మరొక మనిషి కనబడ్డాడు.

"అరె, 'చురుకు కళ్ళు' ఇక్కడున్నాడే!" అన్నారు 'పొడుగూ', 'అడ్డమూ' ఒక్క సారే. వాళ్ళు గుర్తించిన మనిషి కళ్ళకు గంతలు కట్టి ఉండటం రాజకుమారుడు చూసి, "అలా కళ్ళకు గంతలు కట్టుకున్నావే, నీకు దారి ఎలా తెలుస్తుంది?" అని అడిగాడు.

"చక్కగా కనబడుతుంది. గంత లేక పోతే నా చూపు పడినదెల్లా భస్మీపటలం అవుతుంది. నా కళ్ళు అంత తీక్ష్ణమైనవి," అన్నాడు 'చురుకు కళ్ళు'.

ఇలా అంటూనే అతను గంత తీసేసి, ఒక పెద్ద కొండరాయి కేసి చూశాడు. వెంటనే రాయి చిటపటలాడి, కొద్దిక్షణాలకు బద్దలై, వెయ్యి ముక్కలయింది. ఆ రాతి



ముక్కల మధ్య మెరుస్తున్న ఒక బంగారు కణిక ఉన్నది.

రాజకుమారుడు 'చురుకుకళ్ళ' వాణ్ణి కూడా తన సేవలోకి తీసుకుని, "ఉక్కు కోట ఎంత దూరంలో ఉన్నదో, అక్కడ ఏం జరుగుతున్నదో చూడు," అన్నాడు.

"పొద్దు వాలేసరికి మనం ఉక్కుకోట చేరుకుంటాం. అక్కడ మన కోసం వంట చేస్తున్నారు. రాజకుమార్తె ఒక బురుజులో బందీగా ఉన్నది," అన్నాడు 'చురుకుకళ్లు'.

వాడన్నట్టుగానే, రాజకుమారుడు తన అనుచరులతో కొండలు దాటి, అస్తమానం అయేసరికి ఉక్కు కోట చేరుకున్నాడు.

కోటలో నుంచి ఎవరూ వాళ్ళకు ఎదురు రాలేదు. అంతటా నిశ్శబ్దం.

రాజకుమారుడు కోట ఆవరణలో ప్రవేశించాడు; తన గుర్రాన్ని గుర్రపుసాలలో కట్టివేసి, దానికి దాణా వేశాడు. తరవాత నలుగురూ భవనంలో ప్రవేశించారు. లోపల గదులలో ఎవరూ లేరు. కాని ఒక పెద్ద హాలులో శిలలుగా మారిన మనుషులు చాలా మంది, దుమ్ము కప్పి ఉన్నారు.

భోజనాల గదిలో దీపం కాంతిగా వెలుగుతున్నది. నలుగురికి భోజనం వడ్డించి ఉన్నది. నలుగురూ భోజనం చేసేశారు. వాళ్ళు పడుకుని నిద్రపోదా మనుకుంటూండగా ఒక గూనివాడు వాళ్ళున్న చోటికి వచ్చాడు. వాడు వృద్ధుడు. తల మీద వెంట్రుకలు లేవు. గడ్డం మటుకు నడుము దాకా పెరిగి ఉన్నది. వాడు నల్లని అంగీ ధరించి ఉన్నాడు. దాని మీదుగా మూడు ఉక్కుకట్లు వాడి నడుముకు బిగించి ఉన్నాయి. వాడు ఒక స్త్రీని చెయ్యిపట్టుకుని తీసుకువచ్చాడు.

రాజకుమారుడు ఆమెను చూడగానే గుర్తించి, ఆమెను సమీపించ బోయాడు. అతను పెళ్ళాడగోరి ఇంతదూరం వచ్చినది ఆమె కోసమే.

అతన్ని నిలుపుతూ వృద్ధుడు ఇలా అన్నాడు:

"నువ్వు ఎవరివో, ఎందుకు వచ్చావో నాకు తెలుసు. ఈమెను తీసుకుపోదామని వచ్చావు. అలాగే తీసుకుపో. కాని ఒక షరతు. మూడు రాత్రులు ఈమెకు నువు కాపలా కాయాలి; ఆమె తప్పించుకు పోకుండా చూడాలి. అలా చూడలేక పోయావో, నువూ, నీ అనుచరులూ కూడా శిలలైపోతారు."

రాజకుమారుడు తన సమ్మతి తెలిపాడు. వృద్ధుడు రాజకుమార్తెను ఒక ఆసనం మీద కూర్చోబెట్టి వెళ్ళిపోయాడు.

రాజకుమారుడు ఆమెను పలకరించి, ప్రశ్నించాడు. కాని ఆమె జవాబు చెప్ప లేదు; తాను కూడా శిల అయిపోయినట్టు, నిశ్చలంగా కూర్చున్నది. ఆమెను చూస్తే అతనికి చాలా జాలి కలిగింది. ఆమెను తప్పక ఇక్కడి నుంచి తీసుకుపోవాలను కున్నాడతను.

ఆమె తప్పించుకు పోకుండా ఉండ గలందులకు, 'పొడుగు'వాడు తన శరీ రాన్ని పెంచి గది చుట్టూ పరిచి పడుకు న్నాడు. 'అడ్డం' ద్వారానికి అడ్డంగా కూర్చుని, ఈగ దూరే కంత లేకుండా ద్వారాన్ని తన శరీరంతో కప్పాడు. 'చురుకు





కళ్ళు' గది మధ్యనే తిష్ఠవేశాడు. రాజకుమారు ఆ రాత్రి అంతా జాగారం చేయ సంకల్పించి, నేల మీద కూర్చున్నాడు.

కాని కొద్ది క్షణాలకే నలుగురికీ నిద్ర ముంచుకు వచ్చింది. వాళ్ళు తిరిగి మేలుకునేసరికి తెల్లవారవస్తున్నది. అందరి కన్న ముందు కళ్ళు తెరిచిన రాజకుమారుడు రాజకుమార్తె లేదని తెలుసుకున్నాడు. అతను తన అవివేకాన్ని నిందించుకోసాగాడు.

"విచారించకు. ఆమె ఎక్కడ ఉన్నదీ నేను చూస్తాను," అన్నాడు 'చురుకుకళ్ళు'. నూరుమైళ్ళ దూరాన, ఒక పెద్ద వనం మధ్య, ఒక పెద్ద మర్రిచెట్టు చిటారు కొమ్మన మర్రికాయ రూపంలో రాజకుమార్తె వాడికి కనిపించింది.

'పొడుగు'వాడు 'చురుకుకళ్ళు' గల వాణ్ణి తన భుజాల మీద ఎక్కించుకుని వెళ్ళి, క్షణాల మీద మర్రికాయతో తిరిగి వచ్చాడు. ఆ మర్రికాయను నేల మీద ఉంచగానే అది రాజకుమార్తెగా మారింది.

కొండల మీదుగా సూర్యుడు ఉదయిస్తూండగా, వృద్ధుడు వెటకారంగా నవ్వుతూ వాళ్ళున్న చోటికి వచ్చాడు. రాజకుమార్తెను చూడగానే వాడి నవ్వు మాయమయింది. వాడి నడుము కున్న ఉక్కుకట్లలో ఒకటి ఠపామని తెగిపోయి, కింద పడిపోయింది.

తరవాత వృద్ధుడు రాజకుమార్తెను చెయ్యిపట్టుకుని తీసుకుపోయాడు.

ఆ రోజల్లా రాజకుమారుడూ, అతని అనుచరులూ ఆ ప్రదేశమంతా కలయతిరిగారు. చాలామంది మనుషులూ, గుర్రాలూ శిలలుగా మారి కనిపించారు గాని, ప్రాణులెవరూ వారి కంట పడలేదు. వారికి భవనంలో భోజనాలు మాత్రం చక్కగా అమరాయి.

రెండోరోజు రాత్రి వృద్ధుడు మళ్ళీ రాజకుమార్తెను తెచ్చి, పారిపోకుండా చూడమని రాజకుమారుడికి అప్పగించి వెళ్ళిపోయాడు.

వాళ్ళు తిన్న భోజనంలో ఏమైనా మత్తు మందు కలిసిందో ఏమో, వాళ్ళు నలుగురూ నిద్ర ఆచలేకపోయారు. మళ్ళీ తెల్లవారుఝామున వారికి తెలివి వచ్చేసరికి రాజకుమార్తె తప్పించుకు పోయింది.

'చురుకుకళ్ళు' కిటికీ వద్దకు వెళ్ళి, తన కళ్ళగంత తీసి, అటూ ఇటూ చూసి, "రెండువందల మైళ్ళ దూరాన ఒక కొండలో, ఒక బండరాయి మధ్య ఆమె మణి రూపంలో ఉన్నది. 'పొడుగు' నన్ను తీసుకు పోతే, ఆమెను తీసుకురావచ్చు," అన్నాడు.




త్వరలోనే వాళ్ళిద్దరూ మణితో తిరిగి వచ్చారు. నేలపై ఉంచగానే మణి రాజకుమార్తెగా మారింది. మరుక్షణమే గదిలోకి వృద్ధుడు వచ్చి ఆమెను చూశాడు. అతని నడుము కున్న మరొక ఉక్కుకట్టు ఠపామని పగిలి, కింద పడిపోయింది. వృద్ధుడు ఏదో గొణుగుతూ, రాజకుమార్తెను చెయ్యి పట్టుకుని జరజరా లాక్కుపోయాడు.

మూడోరాత్రి కూడా రాజకుమారుడూ, అతని అనుచరులూ భోజనాలు ముగించగానే వృద్ధుడు రాజకుమార్తెను తెచ్చి, వారున్న గదిలో కూర్చోబెట్టి వెళ్ళిపోయాడు.

ఈ రాత్రి మేలుకుని ఉండటానికి రాజకుమారుడు విశ్వప్రయత్నం చేశాడు. కాని లాభం లేకపోయింది. ఒక్క క్షణం కన్ను మూశా ననుకున్నాడు. కాని అతను కన్ను తెరిచేసరికి తూర్పు తెల్లవారుతున్నది.

రాజకుమార్తె మాయమయింది.

రాజకుమారుడు 'చురుకు కళ్ళు' గలవాణ్ణి లేపాడు. వాడు లేచి కిటికీ వద్దకు వెళ్ళి, గంతలు విప్పి చూసి, "మూడు వందల మైళ్ళదూరాన, ఒక సరస్సు అడుగున ఒక ఆలిచిప్పలో ఉంగరం ఉన్నది. అదే రాజకుమార్తె. ఆమెను తెచ్చేందుకు మాతో 'అద్దం' కూడా రావాలి," అన్నాడు.

'పొడుగు' ఈసారి తన దేహాన్ని మరింత ఎత్తు పెంచి, 'చురుకు కళ్ళు' గలవాణ్ణి,

'అద్దం'నూ చెరొక భుజానా ఎత్తుకుని, చాలా పెద్ద అంగలు వేసుకుంటూ బయలు దేరి సరస్సును చేరాడు. 'అద్దం' లావు పెరిగి, సరస్సులో నీరు సగం తాగేస్తేనే, 'పొడుగు' వాడు వంగి, సరస్సు అడుగున ఉన్న ఉంగరాన్ని తీయగలిగాడు.

ఇదంతా కొంచెం ఆలస్యం అయింది. సూర్యోదయం కాబోతున్నది. వెళ్ళిన వాళ్ళు ఇంకా తిరిగి రాలేదు. రాజకుమారుడు ఆందోళన పడసాగాడు. కొండ మీదుగా సూర్యబింబం పైకి లేచింది. తలుపు తెరిచి వృద్ధుడు ద్వారం వద్ద నిలబడి, వెటకారంగా నవ్వుతున్నాడు. అంతలోనే కిటికీ కుండా ఉంగరం లోపల పడింది. మరు క్షణం రాజకుమార్తె గది లోపల నిలిచి కనబడింది.

వృద్ధుడు ఆగ్రహంతో పెడబొబ్బ పెట్టాడు. అతని నడుముకు ఉన్న మూడో కట్టు కూడా ఠపీమని పగిలి కింద పడిపోయింది. వృద్ధుడు కాస్తా ఒక కాకిగా మారి, అరుచుకుంటూ కిటికీ కుండా ఎగిరిపోయాడు.

రాజకుమారుడు రాజకుమార్తె కేసి చూశాడు. ఆమె ముఖాన మందహాసం కనబడింది. ఇప్పుడామె మాట్లాడింది; తనకు విముక్తి కలిగించినందుకు అతనికి తన కృతజ్ఞత తెలుపుకున్నది.

అదే సమయంలో కోట అంతా సందడితో నిండిపోయింది. వృద్ధుడు తన మంత్ర శక్తితో శిలలుగా మార్చిన మనుషులకూ, గుర్రాలకూ తిరిగి ప్రాణం వచ్చింది. అందరూ రాజకుమారుడి చుట్టూ మూగి అతన్ని ప్రశంసించారు. తనదేమీ లేదనీ, అంతా తన అనుచరులే చేశారనీ అతను వారికి చెప్పాడు.

అతని అనుచరులు అతని వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు. రాజకుమారుడు రాజకుమార్తెతో సహా తన ఇంటికి తిరిగి వచ్చి, ఆమెను పెళ్ళిచేసుకున్నాడు.






విశ్వకర్మ నిర్మించిన ఇంద్రప్రస్థ నగరాన్ని రాజధానిగా పెట్టుకుని పాండవులు తమ అర్ధరాజ్యాన్ని ధర్మంగా పాలించ నారంభించారు. రాజ్యం నానాటికీ అభివృద్ధి చెందుతూ వచ్చింది.

ఈ సమయంలో ఆకస్మికంగా నారద ముని ధర్మరాజును చూసి పోదామని వచ్చాడు. ధర్మరాజు తన తమ్ములతో సహా ఎదురు వెళ్ళి, నారదుణ్ణి తీసుకు వచ్చి, సుఖాసనమూ, అర్ఘ్యపాద్యాలూ ఇచ్చి, సాష్టాంగ నమస్కారం చేశాడు. అంతః పురంలో నుంచి ద్రౌపది కూడా వచ్చి నారదుడికి నమస్కారం చేస్తూ నిలబడింది. నారదుడు ఆమెను ఆశీర్వదించి పంపేసి, భీమార్జున నకుల సహదేవులు వింటూండగా ధర్మరాజుతో, "మీ అయిదుగురికీ ఒక్కతె భార్యగా ఉంటున్నది. ఆమె కారణంగా మీలోమీకు విరోధం కలగకుండానూ, మీ మధ్య సౌహార్దం పెరిగేటట్టూ ఉండాలంటే మీరు కొన్ని నియమాలు పెట్టుకోవాలి. ఇలాటి విషయాలలో ఎంత సన్నిహితులకు కూడా వైరం రావటం సహజం," అంటూ సుందోపసుందుల కథ చెప్పాడు.

హిరణ్యకశిపుడి వంశంలో నికుంభు డనే వాడు పుట్టాడు. అతని కొడుకులే సుందోప సుందులు. వాళ్ళు ఒకరినొకరు క్షణం కూడా విడిచిపెట్టక, ఎప్పుడూ కలిసి తిరుగుతూ, ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. వాళ్ళకు మూడు లోకాలూ జయించాలన్న కోరిక కలిగింది. అందుకోసం తపశ్శక్తి

## 17. అర్జునుడి తీర్థయాత్రలు

సంపాదించుకో గోరి వాళ్ళు వింధ్య ప్రాంతంలో ఒక నిర్జనారణ్యం చేరి, అక్కడ ఘోరమైన తపస్సు ప్రారంభించారు. ఆ వేడికి వింధ్యగుహల యందు అగ్ని పుట్టి, అరణ్యమంతటా గొప్ప జ్వాలలూ, పొగలూ లేచాయి.

వాళ్ళ తపస్సు చూసి దేవతలు భయపడి, తపోభంగం కలిగించాలని ఆ సుందోపసుందుల ఎదట రత్నాలరాసులూ, స్త్రీలూ ఉన్నట్టు భ్రమ కలిగించారు. దానికి సుందోపసుందులు చలించలేదు. తరవాత దేవతలు మరొక భ్రమ కలిగించారు. దాని ఫలితంగా సుందోపసుందుల ఎదట వారి తల్లులనూ, భార్యలనూ, కొడుకులనూ ఎవరో రాక్షసులు పీడిస్తున్నట్టూ, వాళ్ళు రక్షించమని సుందోపసుందులను అడుగుతున్నట్టూ కనపడింది. దానికి కూడా సుందోపసుందులు చలించలేదు. అప్పుడు వారి ఎదట బ్రహ్మ ప్రత్యక్షమై వారికి అన్ని రకాల మాయలూ, అస్త్రాలూ, సాటిలేని బలపరాక్రమాలూ, మూడు లోకాలనూ జయించే శక్తి వరాలుగా ఇచ్చాడు. వాళ్ళు అమరత్వం కూడా అడిగారు గాని బ్రహ్మ అందుకు సమ్మతించక, వారికి ఇతరు లెవ్వరిచేతా చావు లేకుండా వరమిచ్చాడు. తాము ఒకరినొకరు చంపుకోవటమనేది వాళ్ళకు తట్టనేతట్టదు గనక,



తమకు అమరత్వం లభించినట్టె వాళ్ళు భావించారు.

ఇలా వరం పొందిన సుందోపసుందులు సైన్యాలను సమకూర్చుకుని, ఇంద్రలోకానికి పోయి, దాన్ని జయించి, పాతాళానికి వెళ్ళి, దాన్ని కూడా జయించి, చివరకు భూలో కాన్ని భీభత్సం చేయసాగారు. అప్పుడు బ్రహ్మ విశ్వకర్మను పిలిచి, అతనిచేత తిలోత్తమ అనే త్రిలోక సౌందర్యవతిని సృష్టించి, సుందోపసుందు లుండే చోటికి పంపాడు. ఆమె ఒక నది ఒడ్డున పూలు కోసుకుంటూండగా చూసి, ఆమెను మోహించి సుందోపసుందు లిద్దరూ ఆమె చేతులు రెండూ పట్టుకుని, ఆమెను తమ భార్యను చేసుకునేటందుకు నిశ్చయించుకున్నారు. "మాలో నువు ఎవరికి భార్య వవుతావు?" అని వాళ్ళు అడిగితే, "మీ ఇద్దరిలో ఎక్కువ బలాఢ్యుడికి భార్య నవుతాను," అన్నదీ తిలోత్తమ. ఎవరు ఎక్కువ బలంగలవారో తెల్పుకోవటానికై వారిద్దరూ గదా యుద్ధం చేసి, ఒకరినొకరు చంపేసుకున్నారు. [అట్ట చివరి బొమ్మ]

నారదుడు పాండవులకు ఈ సుందోప సుందుల వృత్తాంతం చెప్పి, "మీలో అలాటి వైరం రాకుండా ఏదో ఒక నియమం పెట్టుకోండి. ఇదంతా మీ మంచికే చెబుతున్నాను," అన్నాడు.



అప్పుడు పాండవులు నారదుడు సాక్షిగా ఒక నియమం ఏర్పాటు చేసుకున్నారు. దాని ప్రకారం ద్రౌపది ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్క భర్త దగ్గిర ఉంటుంది. ఆమె ఎవరింట ఉంటున్నదో ఆ ఇంటికి మిగిలిన వారెవ్వరూ పోరాదు; ఒకవేళ ఎవరైనా వెళ్ళటం జరిగితే వాళ్ళు పన్నెండు నెలలపాటు బ్రహ్మచర్యంతో వనవాసం జరిపి, తీర్థయాత్రలు చెయ్యాలి.

వారు చేసుకున్న ఈ నియమానికి నారదుడు సంతోషించి, "ఇలాటి ఏర్పాటు



ఉన్నట్టయితే మీ మధ్య ఎవరూ విభేదాలు పెట్టలేరు, మీరు సుఖపడతారు," అని చెప్పి, వెళ్ళిపోయాడు.

ద్రౌపది నియమం ప్రకారం ఏడాదికి ఒక భర్త ఇంట ఉంటున్నది. కాలం గడిచి పోతున్నది.

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు ధర్మరాజు ఇంటి వెలపల నిలబడి ఆక్రందనం చెయ్యటం అర్జునుడు చూసి, "అయ్యా, ఎందుకు ఏడుస్తున్నావు?" అని అడిగాడు.

"నాయనా, మీ వంటి ధర్మాత్ముల రక్షణలో ఉంటున్నా కూడా నా హోమ ధేనువులు దొంగలు తోలుకుపోయినారు.



ఎంత ఘోషించినా నాఏడుపు వినిపించుకునే వారు కనపడటం లేదు. ఆవులు పోవటంతో నా ధర్మకర్మలు నిలిచిపోయాయి. దయచేసి వాటిని నా కిప్పించు," అన్నాడు బ్రాహ్మణుడు దీనంగా.

"నీ ఆవులను నీ కిప్పిస్తాను, ఇక్కడే వుండు. దొంగలు ఎటు వెళ్ళారో చూపటానికి నా వెంట వత్తువుగాని," అంటూ అర్జునుడు ధనుర్బాణాలు తీసుకురావటానికి ధర్మరాజు ఇంట్లో ప్రవేశించాడు.

కాని అంతలోనే అర్జునుడికి తమ నియమం గుర్తు వచ్చింది. ద్రౌపది ధర్మరాజుకు భార్యగా ఉంటున్నది. అలాంటప్పుడు తాను వారి ఇంట ప్రవేశిస్తే నియమభంగ మవుతుంది. నియమభంగ మవుతుందని విల్లుబాణాలు తెచ్చుకోవడంలో ఆలస్యం చేస్తే కార్యభంగం అవుతుంది. నియమభంగమైతే శిక్ష అనుభవించవచ్చు గాని కార్యభంగం కానివ్వరాదనుకుని అర్జునుడు, ధర్మరాజూ ద్రౌపదీ ఏకాంతంగా ఉన్న మందిరం ప్రవేశించి, ధర్మరాజు అనుమతితో ధనుర్బాణాలు తీసుకుని, బ్రాహ్మణుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళి, దొంగలతో పోరాడి జయించి, వారు ఎత్తుకుపోయిన గోవులను బ్రాహ్మణుడికి తిరిగి ఇప్పించాడు.



అర్జునుడు ఇంటికి తిరిగి వచ్చి పెద్దల ప్రశంస లందుకుని, వారికి నమస్కారాలు చేసి, ధర్మరాజు వద్దకు వెళ్ళి, "నియమాన్ని ఉల్లంఘించి, నువ్వూ, ద్రౌపదీ ఉన్న మందిరం ప్రవేశించాను గనక ఒక ఏడాది పాటు వనవాసమూ, తీర్థయాత్రలూ చేస్తాను, అనుమతి ఇయ్యి," అన్నాడు.

ఈ మాటలకు ధర్మరాజు నొచ్చుకుని, "అర్జునా, పెద్దవాళ్ళు భార్యలతో ఏకాంతంగా ఉన్న చోటికి చిన్నవాళ్ళు రావటం తప్పు కాదు. అంతేకాక, ఆ బ్రాహ్మణుడి అవసరం కొద్దీ నువు రావటం జరిగింది. అందువల్ల మేలే జరిగింది గనక అది తప్పు పని కాదు. నా మాట అంటే నీకు లక్ష్యం ఉన్నట్టయితే ఈ తీర్థయాత్ర ఆలోచన మానుకో," అన్నాడు.

ఆ మాటకు అర్జునుడు, "ఒకరు తప్పు చేస్తే మనం శిక్షిస్తాం. అలాటి మనమే తప్పు చేసి, ఏదో సాకు చెప్పి శిక్ష తప్పించుకోవటం తగని పని. నన్ను ఆపవద్దు, నేను తీర్థయాత్రకు బయలుదేరటానికే నిర్ణయించుకున్నాను," అన్నాడు.

ధర్మరాజు సరేననక తప్పలేదు. అర్జునుడు అరణ్యవాసానికి తగిన విధంగా జుట్టూ, కట్టూ అమర్చుకుని అరణ్యానికి బయలుదేరాడు. అతనితోబాటు అనేకమంది





బ్రాహ్మణులూ, పుణ్య కథలను చెప్పే పౌరాణికులూ బయలుదేరారు. వారందరి తోనూ కలిసి అర్జునుడు అనేక తీర్థాలు సేవించి, కొంత కాలానికి గంగాద్వారం చేరాడు.

అక్కడ అనేకమంది మునులు గంగలో స్నానాలు చేసి, అగ్నిని అర్చించి, అందులో ఆహుతులు వేస్తున్నారు. అది చూసి అర్జునుడు చాలా ఆనందం పొంది, తాను కూడా స్నానం చేసి, దేవతర్పణాలూ, పితృతర్పణాలూ అగ్నిలో వేల్చుదామనుకుని స్నానం చెయ్యటానికి నదిలో దిగాడు.

ఆ సమయంలో ఉలూపి అనే నాగకన్య అర్జునుడి అందం చూసి మోహించి, నీటి లోనే అతన్ని పట్టుకుని, నీటిలోకి లాగి నాగలోకానికి తీసుకుపోయి, ఒక దివ్యమైన భవనం చేర్చింది.

అర్జును డామెను చూసి, "ఏమిటి నీ సాహసం? నువు ఎవతెవు? ఎవరి కూతురివి? ఇది ఏ దేశం?" అని అడిగాడు.

"నాథా, నేను నాగులలో ఐరావత కులానికి చెందిన కౌరవ్యుడు అనే నాగరాజు కుమార్తెను. నా పేరు ఉలూపి. మన్మథుడి లాటి నిన్ను చూసి మోహించి, మా నాగుల కుండే శక్తుల ప్రభావంతో నిన్ను ఇక్కడికి తెచ్చాను. నా కోరిక తీర్చి సంతానం పొందు," అన్నది ఉలూపి. [అట్ట మీది బొమ్మ]

"చూడు, ఉలూపీ, కారణాంతరంవల్ల నేను బ్రహ్మచర్యం అవలంబించి, తీర్థ యాత్రలతో కాలక్షేపం చేస్తున్నాను. నన్ను వ్రతభంగం చెయ్యమని నువు అడగటం అధర్మం. నీ మాట ఎలా ఉన్నా నాకు మహా పాపం చుట్టుకుంటుంది," అన్నాడు అర్జునుడు.

కాని ఉలూపి ఆ మాటకు ఒప్పుకోక, "ద్రౌపది విషయంలో మీ అన్నదమ్ములు చేసుకున్న నియమం మాట తెలియక పోలేదు. అయినా నువు బ్రహ్మచర్య వ్రతమని చెప్పి లాభం లేదు. నువు నా కోరిక

ఈడేర్చకపోతే మదనతాపంతో నేను మాడి చచ్చిపోతాను. ఆ పాపం నీకు చుట్టు కుంటుంది. ప్రాణం కాపాడటం కన్న గొప్ప పుణ్యం ఉండదు. నాకు అభయం ఇయ్యి." అంటూ అర్జునుడి పాదాలు గట్టిగా పట్టుకున్నది.

అర్జునుడు పరిస్థితి బాగా ఆలోచించి, ఉలూపి కోరిక తీర్చ నిశ్చయించుకున్నాడు. అతనా రాత్రి ఆమెతో గడిపాడు. మర్నాడు ఉదయం ఉలూపి అతనికి దారి చూపుతూ వెంట వచ్చి, గంగాద్వారానికి చేర్చింది. ఆమె అర్జునుడికి ఏ జలప్రాణి నుంచీ ప్రమాదం లేకుండా వర మిచ్చి తన నివాసానికి తిరిగిపోయింది. ఆమె అర్జునుడి వల్ల గర్భవతి అయి, కొంత కాలానికి ఇరావంతు డనే కొడుకును కన్నది.

గంగాద్వారం వదలి అర్జునుడు అనేక తీర్థాలు సేవిస్తూ, అనేక నదుల స్నానాలు చేస్తూ, బయలుదేరిన పదమూడవ నెలలో మణిపుర మనే నగరం చేరాడు. ఆ నగరానికి రాజు చిత్రవాహనుడు. ఆయనకు చిత్రాంగద అనే కుమార్తె ఉన్నది. ఆమెను చూడ గానే అర్జునుడికి ఆమెపై మోహం కలిగింది. అతను చిత్రాంగదను తన కిచ్చి వివాహం చెయ్యమని ఆమె తండ్రి నడిగాడు.

దానికి చిత్రాంగదుడు, "అంత కన్న నాకు కావసినదేమిటి? కాని ఒక్క విషయం చెప్పాలి. మా వంశంలో ప్రతి తరానికి ఒక్కడే కొడుకు. అయితే నాకు మాత్రం కూతురు కలిగింది. అందుచేత ఈమెకు కలిగే కొడుకును నేను నా కొడుకుగా పెంచు కుంటాను. దాని కభ్యంతరం లేకపోతే ఇప్పుడే నా కుమార్తెను నీ కిచ్చి వివాహం చేస్తాను," అన్నాడు.

అర్జునుడు అందుకు సమ్మతించి, చిత్రాంగదను పెళ్ళాడి, ఆమెతో మూడు నిద్రలు చేసి, తన వెంట ఉన్న బ్రాహ్మణబృందంతో దక్షిణ సముద్ర తీరానికి చేరుకున్నాడు.





# లెనిన్ గాధలు

## 4

లెనిన్ అధ్వర్యాన 1900 డిసెంబరులో "ఇస్క్రా" (నిప్పురవ్వ) అనే పత్రిక ప్రారంభమయింది. రష్యాలోని పార్టీ కమిటీలను చైతన్యవంతం చెయ్యటానికి ఈ పత్రిక చాలా తోడ్పడింది.

1903 లో రష్యా సామాజిక ప్రజాతంత్ర కార్మికపార్టీ రెండవ మహాసభ జరిగింది. ఈ మహాసభలో బలమైన విప్లవ మార్క్సిస్టు పార్టీ ఆవిర్భవించింది. దానిని వ్యవస్థాపించిన వాడూ, దానికి నాయకుడూ లెనిన్.

"ఇస్క్రా" పత్రికలో వ్యాసాలు ప్రచురించేటప్పుడు "లెనిన్" అన్న పేరు అమలులోకి వచ్చింది. ఈ నాటికీ ఆ పేరే ఆయనకు సార్థక నామమై పోయింది. 1903 లో జరిగిన మహాసభలో అభిప్రాయ భేదాలు కలిగి అల్ప సంఖ్యాకులూ, అధిక సంఖ్యాకులూ రెండు గ్రూపులుగా చీలిపోయారు. అల్ప సంఖ్యాకులు "మెన్షివిక్"లు, అధిక సంఖ్యాకులు "బోల్షివిక్"లు. ఈ బోల్షివిక్ అన్న పదం కూడా చాలా వ్యాప్తిలోకి వచ్చింది.

1905 జనవరిలో సమ్మెదార్లు తమ కష్టాలను గురించి జారుచక్రవర్తికి మొర పెట్టుకోవటానికి పోగా, నిరాయుధులైన ఆ కార్మికులపై కాల్పులు జరిపారు. ఒక వెయ్యిమంది చనిపోయారు, అయిదువేల మంది గాయపడ్డారు.

ఈ సంఘటన జారు పరిపాలన గురించి కనువిప్పయింది. దేశంలో భీభత్సం చెలరేగింది. కార్మికులు విప్లవం చేశారు గాని, ఓడిపోయారు. విఫలమైన ఈ విప్లవం నుంచి లెనిన్ చాలా నేర్చుకున్నాడు. జార్ గూఢచారులు లెనిన్ వెంట తగిలారు. లెనిన్



రష్యా వదిలిపెట్టి దేశాంతరాలలో 9 ఏళ్ళ పాటు గడిపాడు. ఈ కాలంలో ఆయనా, ఆయన భార్యా చాలా కష్టాలు అనుభవించారు.

అయినా లెనిన్ తన రాజకీయ లక్ష్యాన్ని ఏమరలేదు. దేశాంతరాలలో ఉండే ఆయన "ప్రావ్ద" (నిజం) పత్రిక 1912లో ప్రారంభించాడు. ఈ పత్రిక ఈ నాటికీ నడుస్తున్నది. అది ఆరంభంలో కార్మికుల విరాళాలతో నడిచింది. జారు ప్రభుత్వం దాన్ని ఒక కంట కనిపెట్టి ఉన్నది. ఆ పత్రికకు ఏడాది నిండేలోగా దాని మీద 36 కేసులు పెట్టారు. 41 సంచికలను జప్తు చేశారు.

1914 ఆగస్టులో మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. యుద్ధం ఆరంభమయేనాటికి లెనిన్ పోలండ్‌లో ఉన్నాడు. ఈ యుద్ధం విప్లవ పరిస్థితికి ఎంతో చక్కగా అనుకూలిస్తుందని ఆయన అంచనా వేశాడు.

యుద్ధం ప్రారంభమైన పది రోజులకే పోలిష్ ప్రభుత్వం ఆయన మీద గూఢచారి నేరం ఆరోపించి అరెస్టు చేసింది. అయితే ఈ ఆరోపణకు ఆధారాలు లేనందునా, పోలండ్‌లోని అభివృద్ధి కాముకులు ప్రభుత్వానికి నిరసన తెలిపినందునా, లెనిన్‌ను విడిచి పెట్టారు.

విడుదల అవుతూనే లెనిన్ స్విజర్లాండుకు వెళ్ళిపోయాడు.

రష్యాలోని యుద్ధ వ్యతిరేకులను ఆయన బలపరిచాడు. లెనిన్ కృషి ఫలితంగా స్విజర్లాండ్‌లో అంతర్జాతీయ సోషలిస్టు సమావేశం జరిగింది. అందులో 11 దేశాల ప్రతినిధులు పాల్గొన్నారు. యుద్ధ మారణహోమం నిలిచి పోవాలంటే ప్రపంచ కార్మికులంతా ఏకం కావాలని లెనిన్ అభిప్రాయం.

ఆయన స్విజర్లాండ్ నుంచి రష్యాకు తిరిగి వెళ్ళటానికి తహతహ లాడాడు.



ఆ అవకాశం 1917 ఏప్రిల్ 3 నాటి రాత్రి ఆయనకు లభించింది. అప్పుడే ఆయన పెట్రోగ్రాడ్ (ఇప్పుడు లెనిన్‌గ్రాడ్) చేరుకున్నాడు. అంతులేని జనం ఆయనకు స్వాగతం ఇచ్చి, కోలాహలంగా సాయుధ శకటంపై నిలబెట్టి ఆరాధించారు.

యుద్ధం వల్ల పరిస్థితి చాలా మారిపోయింది. దేశం అన్ని విధాలా నాశనమయింది. తిండి లేదు. అంతులేని జనక్షయం జరిగింది. చావగా మిగిలినవారు ఆకలితో మాడుతున్నారు. ఈ పరిస్థితిలో కార్మికులూ, పేద రైతులూ ఏకమై ధనికుల నుంచి అధికారం లాగేస్తే శాంతీ, ఆహారమూ, స్వేచ్ఛా వస్తాయని లెనిన్ చెప్పాడు. అధికారాలన్నీ సోవియట్‌లకు హస్తగతం కావాలన్నాడు. (సోవియెట్లన్నవి కార్మిక, కర్షక, సైనిక ప్రతినిధి వర్గాల సంస్థలు.)

తన కొత్త సిద్ధాంతాన్ని ఆయన రోజూ ప్రజల ముందు ఉపన్యసించాడు. 1917 జూన్‌లో అఖిల రష్యా సోవియెట్‌ల మహాసభ జరిగింది. అందులో అన్ని పార్టీల ప్రతినిధులూ ప్రసంగించారు. అధికారాన్ని స్వీకరించేటందుకు సిద్ధంగా ఉన్న విప్లవ పార్టీ లేదని ఎవరో అంటే, "ఆటువంటి పార్టీ ఉంది!" అని లెనిన్ కంఠం ఖంగున జవాబిచ్చింది. పదవులలో ఉన్నవారు మాత్రం అసమర్థులని స్పష్టమయింది. ఆర్థిక అవ్యవస్థా, ధరలూ అదుపుల్లో లేవు. ప్రజలలో అసంతృప్తి చెలరేగుతున్నది. కార్మికులు బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరపటానికి సిద్ధపడుతున్నారు.

జూన్ 18 న అయిదులక్షలమంది కార్మికులూ, సైనికులూ పెట్రోగ్రాడ్ వీధులలో ప్రదర్శనలు జరిపి, "యుద్ధం నశించాలి! శాంతి వర్ధిల్లాలి! అన్ని అధికారాలూ సోవియెట్లకే!" అని నినాదాలిచ్చారు. జూలై 3 న మరొక ప్రదర్శన జరిగింది.

ప్రభుత్వం లెనిన్‌పై జర్మను గూఢచారి అన్న నేరం మోపి, ఆయన కోసం వేట సాగించింది. లెనిన్ ఇళ్ళు మారుతూ, గడ్డం తీసేసి, విగ్గు పెట్టుకుని, రైతు వేషం వేసుకుని అజ్ఞాతవాసం చేస్తూ తిరిగాడు.

అక్టోబరు 1 న లెనిన్, తిరుగుబాటు లేకుండా అధికారం హస్తగతం కాదనీ, తిరుగుబాటు జరగాలనీ నిర్ణయించాడు. తిరుగుబాటు సన్నాహాలు ఫాక్టరీలలోనూ, సైనిక దళాలలోనూ జరిగాయి. స్మోల్నీ భవనం విప్లవ కేంద్రం. అక్టోబరు 24 రాత్రి ఆ భవనం చాలా సందడిగా వున్నది. భవనం ముందు ఆయుధసామగ్రి చేరింది. ఆ రాత్రి గడిచి తెల్లవారేసరికి నీవానది పైన గల వంతెనలన్నీ, టెలిఫోన్ కేంద్రమూ, రైలుస్టేషన్లూ, విద్యుత్కేంద్రమూ, బాంకూ విప్లవకారుల అధీనమయాయి. వింటర్ పాలెస్ పైన దాడి జరిగింది. మంత్రులు అరెస్టయారు.

విప్లవం జరుగుతూండగానే అఖిల రష్యా సోవియెట్ల రెండవ మహాసభ జరిగింది. సోవియెట్ పరిపాలనలో జరిగిన మొదటి డిక్రీ "శాంతి" డిక్రీ.

లెనిన్ విప్లవ సిద్ధాంతాలకు సోవియెట్ రష్యా ప్రత్యక్ష నిదర్శనమయింది. కాని అది చాలా అగ్నిపరీక్షలను ఎదుర్కొన్నది. కొత్తగా పుట్టిన సోవియెట్ రష్యాను పీక పిసకటానికి అనేక పాశ్చాత్య దేశాలు ఏక మైనాయి. తరవాత అంతర్యుద్ధం సాగింది. కాని ప్రపంచంలో మొట్టమొదటి సోషలిస్టు దేశానికి లెనిన్ వేసిన పునాది చాలా దృఢ మైనది. సోవియెట్ రష్యా అన్ని గండాలూ గడిచి బయటపడి, పెరిగి, నేడు అగ్ర రాజ్యాలు రెంటిలో ఒకటిగా ఉన్నది.

1918 లో విప్లవ వ్యతిరేకుల మూలంగా లెనిన్ గాయపడి, తన ఆరోగ్యాన్ని కోల్పోయాడు. 1924 జనవరి 21 న సెరిబ్రల్ హెమొరేజ్ వల్ల ఆయన మరణించాడు.



# 104. పిరెనీజ్ మంచుగుహలు

ఫ్రాన్సుకూ, స్పెయినుకూ మధ్య ఉన్న పిరెనీజ్ పర్వతాలలో సముద్ర మట్టానికి 9,000 అడుగుల ఎత్తున అద్భుతమైన మంచు గుహలున్నాయి. ప్రపంచంలో ఇంత ఎత్తున ఉన్న మంచుగుహలు మరెపిలేవు. వీటిలో "గదులూ", వాటి మధ్య నడవలూ ఉంటాయి. అస్తమానమూ తీవ్రమైన ఈదురుగాలి వాటి కుండా వీస్తూ ఉంటుంది. తడిబట్టలు ఆ గాలికి క్షణంలో పేరుకుపోతాయి. ఎంత వేసవిలోనూ ఈ గుహలలోని మంచు కరగదు. వ్యూహంలాగా ఉన్న ఈ గుహలను చివరంటా తిరగటం దాదాపు అసంభవం. బొమ్మలో చూపినవారు నోర్బర్ట్ కాస్టెరెట్ అనే ఆయనా, ఆయన కుమార్తె మాడ్. వీరు ఇక్కడ అన్వేషణలు చేసి కొత్త గుహలను కనిపెట్టారు.



Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

తొట్టెడు రసం నిండే దెప్పుడు?

పంపినవారు:
ఎస్. రాజేశ్వరి, నెల్లూరు

Photo by Ranbir S. Bakshi



బహుమతి
పొందిన వ్యాఖ్య

కట్టిన గానుగ విప్పే దెప్పుడు ?

పంపినవారు:
ఎస్. రాజేశ్వరి, నెల్లూరు

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జులై నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జులై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తొట్టెడు రసం నిండే దెప్పుడు?
రెండవ ఫోటో : కట్టిన గానుగ విప్పే దెప్పుడు?

పంపినవారు : శింగరాజు రాజేశ్వరి,
రాంనగర్, నెల్లూరు - 2

బహుమతి మొత్తం రు. 20/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## చూడండి, మీకే తెలుస్తుంది...
# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !

ఫలితములను చూడండి. బట్టలను ఆఖరు సారి జాడించునప్పుడు కొంచెము టినోపాల్ వేయండి. అప్పుడు చూడండి. బట్టలు ఎంత తెల్లగా, కళ్లు మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు, చీరలు, దుప్పట్లు, తువాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి!

దానికయ్యే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్‌ను కొనండి. రెగ్యులర్ ప్యాక్, మితవ్యయ ప్యాక్ మరియు బాల్చీకి సరిపోయే పొట్లము—మూడు ప్యాకింగులలో లభిస్తోంది.






® టినోపాల్ జె.ఆర్. గైగి ఎస్.ఎ. వారి స్విట్జర్లండ్‌వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహ్రిద్ గైగి లిమిటెడ్, పి.ఓ. బాక్స్ 11050, బొంబాయి 20 బి.ఆర్.

Shilpi HPMA 12A/70 Tel

